# చిలకపచ్చ చీర

(కథా సంకలనము)

ఐతా చంద్రయ్య





జాతీయ సాహిత్య పరిషత్తు

సిద్దిపేట - 2 .

చిలకపచ్చ చీర (కథా సంకలనము)
జా య సాహిత్య పరిషత్తు - సిద్ధిపేట శాఖ
పచురణ సంఖ్య : 5
పథమ ము దణ : 996
పతులు : 0 0

---



---

వెల : రూ. /-

ముఖచి తం : గోపి

పతులకు :

. ఐతా లింగమూర్తి,
S/o ఐతా చం దయ్య (రచయిత)
ఇం.నెం. - - ,
శేర్‌పురా, సిద్ధిపేట - 502103.

2. సాహిత్య నికేతన్,
బర్కత్‌పురా, హైదరాబాదు.

-. విశాలాంధ పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞానభవన్, - - 35, బాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 00 .

ము దణ :

పద్మావతీ ఆర్ట్ పింటర్స్,
- -517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాద్-500 380.

కవరు పేజి ము దణ :

ఓంసాయి గాఫిక్స్,
నారాయణగూడ, హైదరాబాదు - 500 029.

# కృతజ్ఞతలు

॥ శే॥ సోమ గౌరయ్య గుప్త గారి స్మృత్యర్థం
ఆర్థికంగా సహకరించిన
వారి కుమారులు
సోమ సుందరయ్య గుప్త గారికి.

---

మేమున్నామని ముందు కొచ్చిన సాయినాథ
చారిటబుల్ ట్రస్టు, వాసవి చారిటుబుల్ ట్రస్టు,
కల్యాణి చారిటబుల్ ట్రస్టుల దర్కర్తలకు—

---

"మట్టివాసన" అందించి ఆస్సులందించిన ప్రముఖ కథకులు మాననీయ శ్రీ వాకాటి పాండురంగారావుగారికి;

ముఖచిత్రాన్ని వేసిచ్చిన మేటి ఆర్టిస్ట్ శ్రీ గోపి గారికి;

మా జాతీయ సాహిత్య పరిషత్తు మిత్రులు శ్రీ చెప్పెల హరినాథ శర్మ మరియు శ్రీ కనపర్తి రామచంద్రాచార్యులు గారలకు.

ఈ కథల్ని ముందు ప్రకటించిన పత్రికలు మరియు ఆకాశవాణి; హైదరాబాదు గారలకు,

ఈ పుస్తకాన్ని సకాలంలో సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ వారికి;

కవరు పేజీ కలర్ ఫుల్‌గా అచ్చేసిన ఓంసాయి గ్రాఫిక్స్ వారికి—

—రచయిత.

# కథాక్రమం

# మట్టివాసన

దేశమంటే మనుషులూ, మట్టి కూడా. మనిషి చెమట మట్టిని అన్నంగా, అపరంజిగా మారుస్తుంది. మట్టి లేకపోతే మనిషి లేడు. ఇది భారతీయులకు ఆరు వేల ఏండ్ల నుండి తెలిసిన జీవన సత్యం. అయితే ఆంగ్లేయుల పాలనలో వచ్చిన బానిస విద్య మనకు ఎంత మేలు చేసిందో అంతకన్న ఎక్కువ కీడు చేసింది. సైన్సూ అంతే! అది ప్రసాదించిన వరాలు అన్నీ అద్భుతాలు; కానీ దాని శాపాల కోరల నిజ స్వరూపాలు ఇప్పుడిప్పుడే ఆలోచించే వారికి అర్థమవుతున్నాయి.

ఆంగ్ల విద్యా, ఈ దేశపు మౌలిక ఆర్థిక సామాజిక సంబంధాలను పరిగణించని సాంకేతిక పారిశ్రామిక ప్రణాళికా విధానమూ కలిసి- పచ్చని మన పల్లె సీమలను ఎడారులుగా మారుస్తున్నాయి. ఆ ఎడారి తాపానికి తట్టుకోలేని గ్రామీణులు నగరాల ఎండమావుల వెంబడి పరుగెత్తుతున్నారు. మట్టికి మనిషికి వున్న అనుబంధం ఆవిరవుతున్నది. మనిషికి జంతువుకు వున్న సంబంధం మారుతున్నది. మనిషికి మనిషికి వున్న బంధం మాయమవుతున్నది.

ఆ మట్టిలో రెండు కాళ్ళే కాక మనసును గూడా నిల్పిన ఐతా చంద్రయ్యగారి కథలలో ప్రధాన గుణం ఆ మట్టి వాసనే. ప్రాణం లేని నూలు దారాలతో ఇంద్ర ధనుస్సులు నేయగల నారాయణ ("చిలుక పచ్చ చీర"), పశువుల్ని పసి బిడ్డలుగా చూచుకునే జగదాంబ ("మంచు ముద్ద"), మట్టి ముద్దను కళాఖండాలుగా తీర్చిదిద్దగల ముత్యాలు ("కొడుకు

రాకపాయె") - పా తలు కావు, సజీవ చిత్రాలు. ఇందులో ఒక్కొక్క కథనూ శ్రీ చంద్రయ్య ఒక్కో దానిలో నడిపించడంలో చూపించిన లాఘవం - పంచకల్యాణిలా పరుగులు స్తున్న టి తెలుగు కథ జీవ లక్షణం.

సామాజిక సమస్యల నెన్నుకోవడంలో, వాటిని కథలుగా మలచడంలో, చంద్రయ్యగారి నైపుణ్యం అభినందనీయం. త్రదానం అన్న ఇతివృత్తం మీద కథ "యమతీర్పు", అమెరికా పెళ్ళికొడుకు గురించిన "ఎంగిలి మెతుకు", మొహమాటపు వరుడి పాణిని నాజూకుగా గ్రహణం చేసిన "సన్నాయి రాగాలు", సంతానం అంటే కొడుకేనా అని ప్రశ్నించిన "అంతా మన మంచి ". ఓట్ల కోసం వచ్చే పంచవర్ణ భిక్షగాళ్ళ కాపట్యాన్ని ఎక్స్‌రే సిన "అర తిలో వైకుంఠం" - శ్రీ ఐతా చం దయ్యను టి యువతరం తెలంగాణా పాంతపు కథకుల మొదటి వరుసలో నెలబెట్టి తీరుతాయి.

తెలుగు రచనల్లో హాస్యం మృగ్యమయిన తరుణంలో వీరి కథల లోని నవ్వుల దొంతరలు - నవివేళ చల్లటికుండ నీరు త్రాగినట్లనిపిస్తాయి. "తెల్లందాకా ఇండ్లల్లకు అన్నలొచ్చిరి - అన్నం బెట్టుమ ని. అన్నం వండిపెట్టకపో అన్నలు గొట్టిరి. పెడి పో సొల్లొచ్చి పట్టుకపోయిరి" అన్న బలరాం ("కొడుకు రాకపాయె") మాటలు టి నక్సలైటు - పో సుల అడకత్తెరకు అద్దంపడతాయి. ఆల్ క ర్ గోవధశాల, కా రు నుండి హిందువుల తరిమి త, హా మస్తాన్‌వంటి ప్రసక్తి ఈయన కథలను ఈ నేలమీ గాక ఈ కాలంలో గూడా నిల్పొబెడుతాయి.

"నాగరికుల కంపును జాగ్రత్తగా మోసుకొస్తున్న పెద్ద కాల్వ" - "శివుని జటాజూటంలోంచి వెలువడిన గంగా ప్రవాహంలా వశక్తి

పరుగులు  సింది" - "సా మాజ్య పట్టాభిషిక్తుడవుతున్న వీర శివా ని చూస్తున్న జిజియా మాతయింది రాజవ్వ" - "మాధవరావుకు ఫైలాలజీలో పావీణ్యం వుంది" - (ఇక్కడ ఫైలాలజీ అంటే ఫైళ్లు నడపడం!) - "మనసు గాయాలకు కాలమే మలాము" - "సంసారాన్ని ట్యూషన్ల బండి మీద చాకచక్యంగా నడిపించగల సర్కారు బడి పంతులు" వంటి వర్ణనలు, వాక్యాలు ఈ కథకుని శై - విన్యాసపు ప ్యేకత నెత్తి చూపుతాయి.

ఇదంతా చదివి ఈయనదంతా వెనక చూపేనా అని కొట్టిపారేసే పగతి వీరులు "ఇద్దరూ భర్తలే" అన్ని కథ ముగింపు చూస్తే "హన్నా! పగతివాదం ను గీచిన గీతలు దాటుతున్న !" అనుకోక మానదు.

ఐతా చంద్రయ్యగారి కథలు కొన్నింటిలో ఆయన సూచించిన పరిష్కార మార్గాలు చర్చకు తావు సేవే. కొన్ని కథల్లో చర్విత చర్వణా లున్నాయి. శిల్ప రీత్యా ఇంకా కొంత పటిష్టత అవసరం అన్పిస్తాయి.

అయితేనేమి, ఆయన రేపటి అగ్రశేణి కథకులలో ఒక్కడు! అందుకు సందేహంలేదు. సాక్ష్యాలంటారా, ఈ పదిహేను కథలే!

భాగ్యనగరం. —వాకాటి పాండురంగరావు

# చిలకపచ్చ చీర

"ఈ చీర . నుంచుకుంటా.... ఈ రోజు కట్టుకుంటా!" అంది బాలమణి - ఆశగా.

అప్పు మగ్గం దిగిన చిలకపచ్చ చీరనూ, దాన్ని మడత, పెడుతున్న భర్తనూ చూడగా బాలామణి కళ్ళల్లో కోరిక తళుక్కుమంది. మొహం ఇంద్రధనుస్సే అయింది ఒక క్షణం. బతకమ్మను పేరుస్తున్న చేతులు యాంత్రికంగా ఆగిపోయినై.

భార్యనోసారి - దాంతిలా చూచి కళ్ళు దించుకున్నాడు నారాయణ.

ఆ రోజు బతుకమ పండుగ. ఊరంతా హుషారుగా మురుస్తుంది. సూర్యకిరణాలు పకృతి ఒళ్ళు తడుమకముందే మేల్కొన్నారు జనాలంతా. అలవాటు పకారం అందరికంటే ముందే మెలకువొచ్చింది నారాయణకు. మొహం కడిగి మగ్గమ్మీద కూచున్నాడు. భూపాలం పాడుతూ మగ్గం స్తుంటే బాలామణి కండెలు అందిస్తూంది.

చిలకపచ్చ చీర నేస్తున్నంతసేపూ బాలమణి మనసంతా దాని మీ తచ్చాడింది. అందించాల్సిన కండెలు అందించి బతకమ్మను పేర్వడం మొదలెట్టింది. శోభనం గదిలో అందమైన మగని వైపు ఆశగా అడుగులేస్తున్న పెళ్ళికూతురైంది కోరిక.

"ఆరు చీరలు దిగినై. రేపటి కేడౌతవి. ఏడింటికి ఏడూ పు షావుకారింటి కెళ్ళిపోతై. పండగనాడడిగి కాదనకపోవచ్చు" అనుకుంది.

CC-

చందమామను తెచ్చి చేతికివ్వ మన్న చిన్నపిల్లలా గన్పించింది బాలమణి వాలకం - నారాయణకు.

భార్య మొహాన్నీ బంతిపూలనూ మార్చి మార్చి చూస్తూ.... "నిజంగా, అంటున్నావా?" అన్నాడు. మడతపెట్టడ మాపేసి- మోకాళ్ళ మీద కూచుండిపోయా డలాగే.

"ఏడు నేసిన కూ- డబ్బులు ఈ చీరతో చెల్లుబాటై, ఇంక ఇల్లెట్లా గడవాలి?" అన్నట్టుగున్నా యతని చూపులు.

కనురెప్పలు భారంగా దించుకుంది బాలమణి.

"అందని ఆకాశానికి నిచ్చెన వెయ్యడ మెందుకూ?" మందలించింది అంతరాత్మ.

షావుకారు పదిహేను రోజుల కోసారి నూలు ఇస్తాడు. ఇచ్చిన నూలు ఏడు చీరలకు బొటాబొటిన సరిపోతుంది. నూలు మగ్గాని కెక్కే-ముందు భార్యతో కలిసి పడుగు పొయ్యడం, సరిజెయ్యడం, అతకడం, సాపడం లాంటి పనులు చేస్తాడు. వాటికే ఐదారు రోజులు పడ్తుంది. దొడ్డు చీరై రోజు కొకటి, సన్నదైతే రెం డ్రోజుల కొకటి దిగుతుంది. తాను మగ్గం నేస్తుంటే భార్య కండెలు చుట్టి వెంట వెంటనే అందిస్తుంటే నేత పని సాఫీగా సాగుతుంది.

నేత కూలి.... దొడ్డు చీరకు పది రూపాయలు, సన్న చీరకు ఇరవై.

పెద్ద కూతురు చంద్రకళ తోడుగా ఉంటుంది. రాత్రింబవళ్లు కష్టించి రోజు కో సన్న చీర దించగలుగుతున్నాడు నారాయణ. పదిహేను రోజుల కో సారి ఏడు చీరలు షావుకారింటికి చేర్చాలి. నూటా నలభై రూపాయలూ, మరో ఏడు చీరలకు నూలూ తెచ్చుకోవాలి.

తనూ, భార్యా, ఇద్దరాడ పిల్లల  వితం గడవాలి కూలి డబ్బుల్తో. పెద్దమా యి చం దకళ ఈడేరి ఏ  ండ్లయింది. ఇల్లు గడవడమే గగనమై పోతుంటే అమా యికి పెళ్ళి చెయ్యాల  ఆలోచ  రాలేదు.

తల్లి కండెలు  చుడుతూంటే,  చం దకళ  వంటపనీ,  ఇంటిపనీ చూస్తుంది. చిన్నమ్మాయి సంధ్య తనకు తోచింది చేస్తూంది.

"ఇంకొంచెం నూలు ఎక్కువిస్తే ఇంకా కష్టపడి ఎక్కువ  చీరలు స్తాను గదా!" అన్నాడోసారి షావుకారుతో.

"ఓరి పిచ్చి పుల్లయ్యా!" అన్నట్టుగా న  ్వడు షావుకారు.

"ఇవి వెనకటి రోజులు కావు నారాయణా! అసలు నూలు  దొరక డమే కష్టమైపోతూంది.  ం ద, రాష్ట్ర పభుత్వాలు నూలు  మీద  సబ్సి  లు  సెయ్యడంతో నూలు ధరలు ఆకాశాన్నంటినై.  నా- వ్  వ్యాపా రిని కాదు. పెట్టుబడి గూడా అంతంతమా తమే గదా!  ఏదో....నా మీద ఆధారపడి  మీరూ,  మీ మీద ఆధారపడి  నేనూ  బతకాల్సిం   తప్ప, మనల్ని పట్టించుకు  నాథు   లేడు!" అన్నాడు.

"ఇల్లు గడవటం కష్టంగా ఉంది. కూ  రేట్లన్నా కొంచెం పెంచి బావుం  ది కదా?" అన్నాడు తోటి   తగాడు యాదగిరి.

అదేదో  బూతు  మాట  విన్నంత  ఇదైపోయాడు   షావుకారు. ఆ తర్వాత, "పాపం, మీ అమాయకుల  ందెల్లా?" అనుకున్నాడు.

"యాదగిరీ!  సబ్సి  లు ఎగిరిపోగా   నూలు  ధరలూ,  రంగుల ధరలూ పెరిగినా యన్నాను గదా! దాంతో నేత చీరల  ధరలూ పెంచక తప్పలేదు. చీరల  ధరలు పెరిగినై కాబట్టి, దుకాణాల్లో  జనాలు   మిల్లు చీరల్నే కొంటున్నారు.  త   రల గిరాకీ బాగా  తగ్గింది.  మీ కిప్పుడు కూ  లు పెంచి  ,  మ  చీరల  ధరలు  పెంచాలి. అప్పుడు మన  ర

ఒక్కటి కూడా అమ్మేదు. ఫెయిలైన సినిమా బాక్సుల్లా మన రల గట్టాలు వాపసొస్తై. అప్పుడు నేను చీరలు నేయించను, మీకు పని దొర కదు. మీరూ, నేనూ కడుపులు మాడి చావాలి." అనంత సత్యం చెప్పేశాడు

షావుకారు చెప్పేది నిజమే నన్పించింది.

"సరే.... వద్దు!" అంది బాలమణి తిరిగి బతకమ్మ వైపు తిరిగి.

"మనం . సిన గుడ్డల్ని మనమే వాడుకు. రోజులు కావివి" అంటూంటే, నారాయణలో నిర్వేదం కలుక్కుమంది.

....ఆ రోజులే వేరు. చేతి వృత్తుల కెంతో గౌరవముం ది. మిల్లు చీర లొచ్చింతర్వాత . తగాళ్ళ చేతులు నరి సినట్లైపోతుంది. "భారీ యాం[ ]కరణ మన దేశానికి సరిపోదు. కు[ ]ర పరి[ ]మల్ని పోత్స హించా"లన్న గాంధీ మహాత్ముని మాట....నీటి మూటైపోయింది. శం యం తమయమై పోతుంటే, నిరుద్యోగం సవాలై కూచుంది.

ఏడోతరగతి పూర్తయిన తర్వాత "కళ విద్య లెన్ని నేర్చిన కుల విద్యల సాటి రావ"న్న గువ్వల చెన్నా పద్యం వినిపించి, కుల విద్య కూడూ, గూడూ పెడతాయని, వంశపారంపర్యంగా వస్తున్న నేతను నమ్ముకొమ్మన్నాడు తం డి. అప్పుడది బంగారు గుడ్లు పెట్టే కోడిలా కన్పించింది. వేరే ఏ పనీ నేర్చుకోవాలన్పించలేదు.

ఇప్పుడో....?! రాను రాను రాజు గుఱ్ఱం గాడిదైందన్నట్టు....తన రెక్కలు ముక్కలు చేసుకుని . త పనిలో మునిగినా. భార్యా బిడ్డలు బజారుపాలు కాకుండా జాగ్రత్తపడ్డంతోనే సరిపోతుంది.

ఎలక్షన్లొస్తే నాయకులు తమ ఇళ్ళ చుట్టూ తిరిగి, "మీ వృత్తి చాలా పతి తమైంది. మళ్ళీ మీకు మంచిరోజులొచ్చేల్లా చూస్తా"మని ఏవేవో వాగ్దానాలు కుమ్మరిస్తారు. పూటుగా తాగించి, ఓట్లు దండుకుపోతారు.

కుండలుంచి బిందెలు సుకెళ్ళినట్లయిందని, తర్వాత బాధపడ్డం నేత గాళ్ళ వంతై పోతుంది.

పెళ్ళి కాగా-....ఇంట్లో అడుగు పెట్టిన బాలమణి ఎన్ని ఆశలు కొంగున మోసుకొచ్చిందో....అప్పుడెంత అందంగా ఉం దని! నవనవ లాడే హఛాయ, నిగనిగలా చెక్కిళ్ళు, సోయగాన్నంతా సొంతం చేసుకున్న కళ్ళల్లో కమ్మని కాంతి....తన గుండెల్లో తియ్యని కోర్కెలు పిన్నై ఆ రోజు....పూల గల్లాంటి ఆవిడ చేతులు తనను చుట్టేస్తుంటే... తన ఊపిరిలో ఊపిరై పోతుంటే.... ఏది ఏమైనా సరే - ఆమె ఆశల్ని వము చేయరాదనుకున్నాడు.

తొలిరోజులు నిండు పున్నమి వెన్నెలలో విహరించినట్టు గడిచినై.

"ఇరవై సంవత్సరాల్లో....జీవితం - జీతం మధ్య ఎంత అంతర మొచ్చేసింది? అప్పుడు ఇదే చీర కూలి ఆరు రూపాయలు. అప్పుడు గూడా నెలకు పధ్నాలుగు చీరలే దిగేవి. నెలకు ఎనభై నాలుగు రూపా యల కూ దొరి ది. నలభై రూపాయలకు బస్తా బియ్యం మొచ్చేవి. తల్లి, తండ్రి, తనూ, బాలమణి - అప్పుడు నలుగురే.... ఇప్పుడూ నలుగురే. ఇప్పుడు ధరలేమో చుక్కలనెక్కి వెక్కిరిస్తున్నై.

"నా బతకమ్మ పేర్వడమైపోయింది. అట్లాగే కూసున్న వేందీ?" అంది బాలమణి గట్టిగా శూన్యంలోకి చూస్తున్న భర్తను కుదిపి.

నారాయణ ఆలోచనా వీచికలు చెల్లా చెదరైనై.

"ఆఁ. పటికల్లా మరోటి చేస్తే ఏడైపోతై. షావుకారు కిచ్చేయాలి" అంటూ మగ్గంవైపు నడిచాడు.

బతకమ్మను సాగనంపి వచ్చిం తర్వాత "అందరూ కొత్త రెలు కట్టుకొచ్చిం డు, మనవే పాతవి" అని సంధ్య రుసరుసలాడ్తుంటే తం డి కడుపులో విన్నట్లైంది.

"ఈ దరి ద మెప్పుడు పోతుంధి నాయనా? నా తోటోళ్ళంతా పిల్ల తల్లులైంద్రు, పట్టుచీరెలు కట్టుకొచ్చిం డు." కడుపులోంచి తోసుకొచ్చిన బాధ చం దకళ కళ్ళల్లో బిందువులుగా మారింది. మొహం కళావిహీన మైంది.

"నువ్వుకూడా అంటున్నా వా చం దకళా?" బాలమణి అందుకుంది. "రా తనకా, పగలనకా మీ నాయిన కష్టం స్తున్నడు. బొక్కలు చిక్కినై. ఇం ం జెయ్యిమంట ?...." భయంకరమైన దగ్గుతెర గొంతు నొ క్కసింది.

చం దకళ అందించిన నీళ్ళు తా సి మంచంమీద ఒరిగిపోయింది. కళ్ళు అవ్యక్తమైన బాధతో చెమ గిల్లినై - వెడల్పాటి ఆశయాలు చిలక పంజరంలాంటి జీవితంలో బంధించబడ్డాయని.

బాలమణి చాలా రోజుల్నుంచి దగ్గుతుంది. ఒక్కోసారి రెండు మూన్నిముషాలు ఆగకుండా దగ్గుతూ అల్లాడిపోతుంది. డాక్టరుకు చూపిస్తానంటే-"నా మీ కాలేదు, అ తగ్గిపోతుంది" అంటుంది. ఆ మాట వెనక దాగున్న అంతరార్థం అతనికి మా తమే తెలుసు.

"రేపు ఈ ర లిచ్చిన తర్వాత డాక్టరుకు చూపిస్తా బాలమణీ!" అన్నాడు మగ్గమీ ద కూచుంటూ.

"నాకు బాగా ఉందిగాని, ఎల్లుండి దసరా. నీకున్న ధోవతి చినిగింది. ఇంట్లో ఉండేవాళ్ళం మేమెలాంటివి కట్టినా చెల్లుతుంది. ను వ్వమో బయటికెళ్ళి రాలాయె. ఒక ధోవతి కొనుక్కో ముందు" అంది బలాన్నంతా కూడదీసుకుని లేచి కూచుంటూ.

షావుకారు రలందుకుని, నూటా నలభై రూపాయలు చేతిలో పెట్టా-

"ఏమీ అనుకోకు నారాయణా! నీ ధోవతి బాగా చినిగింది. దాంతో బజార్లో కెట్లా రాగలిగావ్?" అన్నాడు.

తల తీసేసినట్టైంది.

నూటా నలభైలోంచి ఇరవయైదు రూపాయల్తో ఒక ధోవతీ కొ. శాడు. మిగతా డబ్బులు సరకులకు సరిపోలేదు. పద్దు రాయించక తప్ప-దు. ఈసారి సుకొచ్చిన నూలంతా చిలకపచ్చ రంగు . ఇందు లోంచి ఒక ర బాలమణికి ఉంచాలనుకున్నాడు.

దసరానాడు కొత్త ధోవతి కట్టుకుని మి తులతో జంబికెళ్తుంటే నారాయణకు స్వర్గలోకంలో విహరిస్తున్నట్టనివించింది.

తిరిగొచ్చే సరికి ఇంటి నిండా జనాలున్నారు. బాలమణి మంచ మ్మీద పడుకునుంది. ఇద్దరు కూతుళ్ళు 'అమా , అమా ' అంటూ ఏడు స్తున్నారు - తల్లిమీద పడి.

నారాయణ గుండెలు గుబగుబలాడినై .

"ఏమైందీ?"

గుహలో పులి నోటికి చిక్కిన మేకలా వినిపించింది నారాయణ గొంతు.

"అమ దగ్గీ దగ్గీ చచ్చిపోయింది నాయిచా!" చం దకళ తల బాదుకుంది.

ఆకాశం విరిగి మీద పడింది. చుట్టూ ఉన్న గోడలూ, కాళ్ళూ పాతాళంలోకి కుంచించుకుపోతున్నట్లనిపించింది.

"అయ్యో బాలమణీ!" సి కుప్పలా కూలిపోయాడు.

"నన్ను కట్టుకుని ను వ్వేం సుఖపడ్డావ్? తగాని భార్యవైనందుకు విితమంతా వెతలతో గడిచింది గద!" కడుపు పొరల్లోంచి తెరలు

తెరల్లుగా తన్నుకొచ్చిన దుఃఖం కరిగి కళ్ళద్వారా ధారాపాతమైంది. కటి సము దం కెరటాలు జీవితపు అంచుల్ని కసిరి కసిరి కొట్టినై.

రావాల్సిన వారంతా వచ్చి, అంత్యక్రియలకు డబ్బు కావాలన్నారు. ఎక్కడుంది డబ్బు?

"ఎక్కడైనా అప్పు తెస్తే....?" సలహా పా శా డొకాయన.

" త గానికి అప్పెవ డిస్తాడు?" సమాధానం చెప్పా డింకొకాయన.

బాలమణి మంగళసూత్రం అంత్య ియల కందుకుంది.

వారం రోజుల ఏడ్పుల తర్వాత కర్తవ్యం గుర్తుకొచ్చింది.

చంద్రకళ కండెలు చుట్టిస్తానంది. వంటింటి భారం సంధ్యమీద పడింది. బాలమణి పనులు చంద్రకళ చేస్తుంది.

సరుకులన్నీ నిండుకున్నై.

చం దకళ చారవవల్ల చేబదుళ్ళతో మూ డోజులు గడిచినై. అప్పటికింకా రలు దిగలేదు.

ఒక రోజు ఉపవాసంతో గడిచింది.

దీపావళి పండగ రాబోతుంది.

మర్నాడు చం దకళ ని దలే సరికితెల్లవారింది.

తెల్లవారకముం తనను ని దలేపి తను మగ్గమీ ద కూచుంటా నన్నాడు రా తి తం డి. మరెందుకు లేపలేదూ?

త డి మంచం దగ్గర కెళ్ళింది. మంచమీద నారాయణ కన్పించలేదు. మగ్గం చప్పుడు కూడా లేదు. అయినా అటువైపెళ్ళింది. నారాయణ మగ్గానికి వేళ్ళాడుతున్నాడు.

నడుంవరకు మగ్గంత పైకి.... కాళ్ళు గుంతలో.... నాలుక యటికొచ్చింది. మొహం భయానకంగా మారింది.

చంద్రకళ గుండెల్లోంచి ఉప్పొంగిన భయం పెద్ద కగా వెల్వడింది. కండరాలన్నీ ముక్కలుగా కోసినట్టు, చావుకన్నా భయంకర మైన అనుభవం.

ఆ క చుట్టుపక్కల వాళ్ళకు ఆర్తనాదంలా వినబడింది. అందరూ పరుగెత్తుకొచ్చారు. క్షణాల్లో ఇల్లంతా నిండిపోయింది. వింతగా చూస్తున్నా రంతా.

"ఎప్పుడో చచ్చాడు పాపం!" అన్నాడొకాయన.

"నము కున్న మొగ్గం ఉగ్గమైపోయింది" అన్నాడు యాదగిరి.

శవం నడుముకో కాగితం కన్పించింది. గట్టిగాచదివాడు యాదగిరి:

"అమ్మాయిలూ!

"మా అమ్మా నాయనలు నిన్ను పెంచినట్టు . ను మిమ ల్ని పెంచలేకపోయాను. రానురాను ఎతుకు భారమైపోతుంది. కన్నకూతుర్ల పేగులు ఆకలితో మాడుతుంటే నా కండలు కోసి కారం చల్లినట్లయింది. ఈ బాధ, మానసిక క్షోభ భరించలేను. సంపాదించి మిమ్మల్ని సాకలేను. మీ పెళ్ళిళ్ళు చెయ్యలేను.

"మీ అమ తోనే . నుకూడా పోవాలనుకోండి. నేతగాని కడుపున పుట్టినందుకు మీరు జీవితమంతా ఏడ్వాల్సివస్తుంది. నా కడుపున పుట్టడమే మీరు చేసిన పాపం. నేను చస్తే సమాజం సానుభూతన్నా మీకు దక్కు తుంది. అ మీకో దారి చూపిస్తుంది. చేతగాని ఈ తగాణ్ణి క్షమించండి. మీ అమ దగ్గరి వెడుతున్నాను.

అసమర్థుడైన మీ నాయన
నారాయణ."

(ఆంధ్ర పభ వారప త్రిక. -ఫే. -మే, 9 ,

# మంచుముద్ద

**నా** తెలంగాణ కోటి రతనాల వీణ-ఆశయం సూపర్. ఆచరణలోనే మెలిక వేస్తుంది పకృతి. మెతుకు (మెదకు) సీమలోని మెతుకు , తి బీరకాయలోని నెయ్యిలాగై పోతుందని ఊహించి ఉండరు.

బలహీనుడి మీదికి బహ్మాస్త్రం పయోగించినట్టు - బండల గుండెల్ని బద్దలు కొడుతున్న ఎండలు రోజంతా చంద్రనిప్పులు కురిపి స్తున్నాయి. వానకాలంలో గాలి జోరు, చలికాలంలో చలితో జారు. నాలు ళ్ళ నుండి ఇ తంతు. ఎండకాలం మాత్రం బలం పుంజుకుని సార్థక నామ యురాలైంది. మేకమాంసం మరిగిన తో లులా ఏటేటా రెండాకు లెక్కువ చదివేసి ప్రాణాలను పీక్కు తింటుంది. చెప్పులు లేకుండా బయటికెళ్ళాలంటే - ఎ రని నిప్పుల మీద నడవాలన్నట్టే.

"వసంతకాలమంటే - చెట్లన్నీ ఆకుపచ్చ పీతాంబరాలు కట్టుకున్న ముత్తైదువుల్లాగుం వప్పుడు."

"మా చిన్నప్పుడు బావులల్ల, చెరువులల్ల గంగమ తల్లి కాపుర ముండేది. ఎండాకాలంలో పొద్దంతా ఈతగొట్టేవాళ్ళం. విసుగొస్తే మామిడి తోటల్లో కోతికొమ్మచ్చి ఆడుకు- వాళ్ళం."

"ఆ కాలమేమైందో! ఆ రోజు లెటుబోయినయో! ఏ దేవుని శాపమో! మల్లా అటువంటికాలం ఈ కండ్లతో చూస్తమో లేదో!"

గుట్టల్లోకి జారవిడిచినట్టున్న రాఘవాపురంలో ఏ పెద్దమనిషిని కదిపినా ఆ మాటలు.

ఐతా చంద్రయ్య

నీళ్ళులేని బావులు బ్రహ్మరాక్షసుల్లా నోర్లు తెరుచుకున్నాయి. సగం కుటుంబాలు ఊరు విడిచి నీటి జాడల్లోకెళ్ళిపోయాయెప్పుడో. మిగతా కుటుంబాల తాహతు పుట్టిన ఊళ్ళోనే తాడో పేడో తేల్చుకోమ ని శాసించింది.

కడుపులో ఎలుకలు పరుగులు దీస్తున్నా - ఎండకు బయటికొచ్చే ధైర్యం చాలక, వడదెబ్బకు వాడిన కూరాకుల్లా ఇళ్ళల్లో పడుంటున్నారు సగటు మనుషులు.

చైతన్యం కోల్పోయి శాపగ్రస్తమైనట్టు - మోడు బారిన చెట్లతో, మాడిన పశువుల డొక్కలతో మరుభూమిగా కన్పిస్తుందా ఊరు. నీటి కరువు కళ్ళకు నీళ్ళు దెప్పిస్తుంది. కండలూ, నెత్తురూ లేని మనిషిలా తడిలేని చేద బావులు తమ ఉనికి నెప్పుడో కోల్పోయినై.

మేత కరువైన పశువుల అరుపులు దొడ్లను దాటి ఊరందరి గుండెల్లో రైలు కూతలు వినిపిస్తున్నాయి.

బీడువారిన పంట పొలాలు 'మామీద నీకెందు కింత పగ?' అని దీనంగా ప్రశ్నిస్తూంటే ఈ రోజుకిక చాల్లే అనుకుని సూర్యుడు ఉగ్ర రూపం ఉపసంహరించి పడమటి కొండల్లోకి జారుకున్నాడు. మేడల నీడలు వాకిళ్ళముందు పలచబడుతున్నాయి. బయటికొచ్చే సమయమైంది జనాలకు.

తలుపులు తెరుచుకుని జగదాంబ బయటికొచ్చింది. ఇంటి ముందున్న దొడ్లోంచి 'అంబా, అంబా' అని వినబడింది. అయిదు పదులు దాటిన జగదాంబ అటు నడిచింది. అన్నీ పోగా మిగిలిన రామలక్ష్మణులు దీనంగా చూస్తూ మరోసారి 'అంబా' అన్నాయి కడుపులో కలుక్కుమంది. పొద్దుట్నుంచి నీళ్ళూ, మేతా లేక డొక్కలు లాపడినై.

నిప్పులు గక్కే ఎండను లక్ష్యపెట్టకుండా రెండు గంటలముందు కొడుకు మురళి కావడి నుకుని నీళ్ళ వేటకు బయలు రాడు. ఊళ్ళో నీళ్ళు దొరకడం కల్ల. ఊరు బయటకెక్కడికో వెళ్ళుంటాడు. మురళి నీళ్ళుదెస్తే, ఎడ్ల ప్రాణాలు దక్కేట్టుంది. రాత్రి వంటగ్గూడా కావాలాయె.

తన భర్త బతికున్నప్పటి , ఇప్పటికీ ఎంత తా! వలం ప ళ్ళ లో. కాలగతులిలా మారాయేమిటి? పరిస్థితి అప్పుడిలాగే ఉంటే నలుగురు కూతుళ్ళ పెళ్ళిళ్ళూ, సారెలూ, కాన్పులూ అంత వైభవంగా జరిగేవా? ఆడపిల్లలు అదృష్టం నిచ్చెన మెట్లెక్కిం తర్వాత, మురళి ఎదిగాడు. చదువు పూర్తిగాకముందు తండ్రిని పోగొట్టుకున్నాడు.

మిగిలిన రెండెద్దులు- అ- ....రామలక్ష్మణులు - తమ దొడ్లో పుట్టి పెరిగినవే. కన్నతల్లి 'లక్ష్మి' గోముగా వాటి వీపు నాకుతూంటే చూడముచ్చటేసేది. లక్ష్మి కడవెడు పాలిచ్చేది. పిల్లలు రోజుకు రెండుసార్లు గుమ్మపాలు తాగేవారు. ముప్పూటలా గడ్డ పెరుగుతో భోంచేసేవారు. చేతి నిండా నెయ్యి పోసుకుని అన్నంలో కలుపుకునేవారు. అదో స్వర్ణ యుగం. వృద్ధాప్యమావరించి లక్ష్మిని దొడ్డి పరిమితం చేసింది.

"ఈ ఆవు ముసలిదైందిగదా, నాకమ్మేయమ్మా!" అడిగాడో రోజు చెప్పులు కుట్టే బాలయ్య.

తనకు చిరాకేసింది. బాలయ్యను చీరెయ్యాలనిపించింది కానీ, ఆతని వృత్తి అతన్నలా అడిగించిందని శాంతించింది.

"ఇది నా ఇంటి లక్ష్మి బాలయ్యా! దీన్ని అమ్ముకోవడమంటే కన్నతల్లిని అమ్ముకోవడమే."

"అయ్యో.... గట్లంటే ఎట్లమ్మా! ఇయ్యాల్లగాకపో రేపు ఛస్తది. గప్పుడైనా నన్నే పిలిపించి ఇస్కపొమ్మంటరు గదా?...."

ఐతా చం దయ్య

ఇం దో అనబోయిన బాలయ్యను తన ముఖకవళికలు ఆపేశాయి.

"చచ్చిం తర్వాత ఏం జెయ్యాల్నో నాకు బాగా దెల్సు. ఇప్పుడు నువ్విం ం మాట్లాడినా మర్యాద దక్కదు. పో!" గర్జనలాగొచ్చింది గొంతులోంచి. ముక్కుపుటా లెగిసిపడ్డాయి.

లక్షి పార్థివ శరీరం తమ పొలంలో భూస్థాపితమైంది. రామ లక్ష్మణులు దాని గుర్తులుగా మిగిలాయి.

జరిగిపోయిన రోజులు జ్ఞాపకాల పొరల్లో దోబూచులాడుతున్నాయి.

"అమ్మా, నీళ్ళు దెచ్చి ్న!" శత్రుదు ర్భద్యమైన రెండు కోటలు జయించుకొచ్చిన వీర శివాజీలా మురిసిపోతూ కావడితో వచ్చాడు మురళి.

చుట్టుపక్క లమ్మలక్కల పాణం లేచొచ్చింది.

"ఎక్కడ దొరికినయ్ ముర ?" ఆత్రంగా అడిగారు నలుగురా సారి.

"మనూరి పొలిమేర దాటిపోయిన. లింగారెడ్డి పల్లె దూ కులోల్ల మోటబాయిల బోరింగేసింద్రు. మోటరు పెట్టిం డు మొన్ననే....బతిమలాడి తెచ్చిన."

ఊళ్ళో కొందరు బోరింగులు వేయించుకున్నారు. కొన్ని ఫెయి లైనై. మరికొన్ని నెల రోజులు మురిపించి మూతులు ముడుచుకున్నై.

బిలబిలమంటూ ఆడవాళ్ళు కడవలు అందుకుని బయలు రారు దూ కులోల్ల బావికి. ఒకరి నొకరు పట్టించుకోని పరుగుల నడక చూస్తుంటే - కడవల పరుగుపందెమేమో ననిపించింది.

"మంచి పం సినవవ్ కొడుకా! లేకపో మన పాణాలు నిలిచే తట్టు లేవు" అంటూ కావడిలోని ఒక కడవ నీటిని రెండు పాత ప్లా క్ బకెట్లలో పోసి ఎద్దులముందుంచింది జగదాంబ.

రామలక్ష్మణులు చెవులాడిస్తూ అవురావురుమంటూ తాగేశాయి. మరో కడవెడు నీళ్ళు రా తి వంటకు సరిపెట్టుకున్నారు.

o o o

"అమా ! నువ్వు నానమ్మవై పోయిన ."

"ఆఁ.... నిజమా? మీ మామ ఉత్తరం రాసిండా?"

"ఔఁ .... నాకు కొడుకు పుట్టిండంటా.... టాట్టట్టా."

అయి , ఈ జగదాంబ ఇంట్లో జగ కవీరుడు ఆడుకుంటాడన్న మాట.''

"వెంట వెళ్ళి నీ పెళ్ళాన్నీ కొడుకునూ చూచిరా పో!''

''ఆ ఊరికెట్ల పోవాల్నె ఇప్పుడు?''

''ఔ|నా.... నువ్వు పెండ్లి సుకుని జానకితోని రామలక్ష ణుల కచ్చరమీ దొస్తివి. అప్పుడు ఏనుగులోలె ఉన్న మూగజీవాలు ఇప్పుడు పీనుగులై పోతున్నై. కచ్చరం నడువది. బస్సుమీదపోయిరా!''

"అమా ! నీగ్గూడా మనవణ్ణి చూడాలనిపించడం లేదా?''

''ఎందుకనిపించదురా? మనూరిని దరి దం పీడ పట్టుకుంది. లేక పో. నీకంటే ముం నా మనవనికి బొమ్మలూ అవీ స్కుని పోదుంటీ. నా పాణాలన్నీ ఆ బుడ్డోడి మీదా, జానికి మీదనే ఉన్నాయిరా! మనిద్దర మొక చేసారిపో ఇక్కడ రామలక్ష ణులు ఆగమైపోతరు గదా!''

"మా అమ్మ కప్పుడే మనవడిమీద మనసు పడిం ! నిజమేనమ్మా! ను వచ్చింతర్వాత నువ్వు పోయిరా."

హమ్మా! వీడికెంత ఇది? తన కొడుకును తా ముందు చూడాలని ఆరాటం. కడుపు తీపి కింద కడవెడు అమృతమైనా దిగదుడుపే.

"సరే మంచిది, నువ్వు బయల్దేరు."

o o o

ఉదయం.... భూమాత నలుముకున్న కటి బూడిద రంగుగా మారుతోంది.

"అమా ! జగదాంబమా !" గ్రామాధికారి కిష్టారెడ్డి పిలుపు.

జగదాంబ తలుపులు సింది. కిష్టారెడ్డి వెంట ఇద్దరు కొత్త మనుషులున్నారు. వాళ్ళనెప్పుడూ చూడలేదు.

"ఏంది కిష్టారెడ్డి?" తాను గూడా బయటికొచ్చింది.

''ఏం లేదమా .... మరీ.... మరి....'' మెలికలు తిరిగినంత పనై పోతూంది. నవ్వొపుకుంది జగదాంబ.

''చల్లకొచ్చి ముంత దాస్తావెందుకూ?''

"మరి నువ్వేమీ అనుకోవద్దమ్మా!''

''సరే, చెప్పు.''

"పీళ్ళిద్దరూ పశువుల ఖరీదుదార్లు.నిన్న రా మనూరి కొచ్చిం డు. పశువుల్ని కొంటున్నరు. చాలామంది అమి ం డు.''

"ఔనమ్మా! గేదెలూ, ఆవులూ, ఎద్దులూ, దున్నపోతులూ.... లారీ సగం నిండింది. ఇంకో గంటలో వెళ్ళిపోతాం" అన్నాడు కొత్త మనిషి.

విషయమేమిటో అర్థమైపోయింది. కడుపులో తెడ్డుతో కలబెట్టి నట్టనిపించింది.

"ఈ కరవు దెయ్యం మనూర్లె జొచ్చె." కిష్టారెడ్డి తనవంతు దళారీ కర్తవ్యం నిర్వహిస్తున్నాడు. "మనషులకే తి తందుకు, తాగేతందుకు కరవాయె. ఇంగ పశువులనెట్ల దక్కించుకుంటాం?"

నిజమే....కష్టమే.

"మీ దగ్గర గూడా రెండు ఎద్దులున్నాయిగదా!" దొడ్లోకి చూస్తూ స్థిరంగా అన్నాడు రెండో కొత్తమనిషి.

నరాలు మెలిబెట్టినట్టనిపించింది.

"మీ ఊరు?"

"మాది మచి పట్నం - కృష్ణాజిల్లానం !"

అదృష్టవంతులు. కృష్ణా, గోదావరము లు కోస్తాజిల్లాలకు కొంగు బంగారాలై పోయినై. వర్షంతో పనిలేకుండా, కరవు కాటకాల నాఛాయ లకు రానీయవు. పొలాల్లో బంగారం పండుతుంది. గొడ్డూ గోదా ఎప్పుడూ పచ్చగా ఉంటై. అక్కడై నా రామలక్ష్మణులకు నీళ్ళకూ, మేతకూ కరవుండదు. ఇక్కడే ఉంచి వాటి పాణాలు దీసేకన్నా అమి ం నయం.

"మరి....మీ ఎద్దు ...." ధైర్యం చాలక బేకులేసిన సైకిల్లా ఆగిపోయాడు కిష్టారెడ్డి.

ఎట్లో వెళ్తున్న పతాపరెడ్డిని కేకేసి పిలిచాడు. ఏడు పదులు దాటిన పతాపరెడ్డి క ర సాయంతో వచ్చాడు.

"మన ప్రతాప్ తాత గూడా అమ్మిండు ఆవుల్ని, ఎడ్లనూ...." నవ్వబోయి ఆగిపోయాడు కిష్టారెడ్డి.

జగదాంబ కనురెప్పలు, కనుబొమలూ పైకి లేచాయి-'నిజమేనా?' అన్నట్టుగా.

"అమి నాను త ! భూమీ ద చుక్కనీళ్ళు లేకపాయె. వాటికి మేత లేకపాయె. ఇన్ని రోజులు వ్యవసాయం సి మనల్ని కాపాడిన పశు వులు ఇప్పుడు అము డుబోయి మనల్ని కాపాడుతున్నాయి. నాల్గు రూపా యలు చేతులకొస్తే పట్నం నుంచి తి- గాసమైన తెచ్చుకుంటాం గదా!"

"ఏందో పెద్దయ్యా! స్వతం తమొచ్చి గి౹ౘండ్లయిందిగదా! మన గతి గింత౹ ఉండిపాయె." నిట్టూర్చింది జగదాంబ.

పతాపరెడ్డి ముఖమ్మీద విషాద రేఖలు.

"ఔను బిడ్డా! నన్ను జూడు ఇంగ్లీషోని జమాన జూచిన, నైజాం జమాన జూచిన, ఇప్పుడు ఈ జమాన జూస్తున్నా. ఎవలొచ్చినా, పోయినా మన రాజ్యంల కరువు మాౘత్రం పోలేదు. వోట్ల కొరకు దిరిగెటోళ్లే కాని, మన పాట్లు జూసెటో్ల లేరు. అప్పుడు పకృతి చల్లగా చూచేది. ఇప్పుడు కోపానికొచ్చింది.గివన్నీ చూసెతందు ఈ పాడు జన ఇంకా ఉందమా ! ఈ కరువు పాడుగాను. పసిపిల్లలు ఆకలితో మాడుతున్నరు, బిడ్డలనంటి పశువుల్ని అము కుంటి." గొంతు రబోయింది. గుండె గుబగుబలాడింది.

మసకబారుతున్న కళ్ళను రుమాలుతో అద్దుకుంటూ "పశువులను అమ వద్దనుకుంటే వాటిని చంపిన పాపం మన౹ చుట్టుకుంటుందాయె. మరిం ం జెయ్యాలె?" నిట్టూర్చాడు.

ఉదయం నీరెండలా ఉబికొస్తుందో నిర్ణయం జగదాంబలో.

మురళి లేకపాయె అనుకుంది మొదట. ఆ తర్వాత .... వాని తోడబుట్టిన తమ్ముళ్ళలాగున్న రామలక్ష్మణుల పాణాలు నిలబడుతూంటే వద్దంటాడా? వాడొచ్చేదాకా వీళ్ళాగరైరి.

"వాటిని అమ్మా లంటే నా కొడుకుల్ని అమ్ముతున్నట్టనిపిస్తుంది కిష్టారెడ్డి! కాని, ఏం స్తాం? మన దగ్గరుంటే అవి బతుకవాయె!" అంది.

కిష్టారెడ్డి అంతరంగం రెపరెపలాడింది. కమీషన్ కళ్ళముందు కనబడింది.

"నీళ్ళు, మేతా లేక అవి కొట్టుకుంటుంటే వాటి గొంతులు పిసికి చంపాలనిపిస్తుంది బిడ్డా, మన !" పతాపరెడ్డి హెచ్చరిక.

-రం కుదిరింది. బరువెక్కిన గుండెల్తో మెల్లిగా దొడ్లోకెళ్ళింది జగదాంబ. రామలక్ష్మణుల వీపు నిమిరింది. కళ్ళు తడైపోయాయప్పటి- .

"మీకూ, మాకూ రుణం రిపోయిందిరా!" రెండు చేతులో ఎద్దుల మెడల్ని వాటేసుకుని బోరుమంది. రాముని మనిపించిందో గొంతును జగదాంబ భుజమ్మీదానించింది. లక్ష్మణుడు 'అంబా' అంటే, అది 'అమా ' అని వినిపించింది.

''ఈ పాపిష్ఠిదాన్ని క్షమించురా లక్ష ణా! మీరు బతికిబయటపడా ల- నా ఆరాటంరా!" గొణుగుతూ మూపురమ్మీద నిమిరింది.

''ఇంగ దీసుకపోం డి" అని ఇంట్లో ళ్ళి తలు పేసుకుంది.

పశువులతో లారీ నిం సరికి తొమి దైంది. అప్పటి సూర్య ప్రతాపం - -లిము దగాళ్ళ ముందు మహా పండితుని సాహిత్యోప న్యాసంలా విజృంభించింది.

'అంబా - అంబా'లతో లారీ కదలబోతోంది. ఇ మా కడసారి చూపులన్నట్టు పశువులు అక్కడే నిల్చున్న తమ మాజీ యజమానుల్ని చూస్తున్నాయి. కరిగిన గుండెలు కన్నీరై బయటికొస్తుంటే, వీడ్కో లిస్తున్నారు జనాలు.

కిష్టారెడ్డి కమీషన్ పైసల్తో సహా ముట్టజెప్పి లారీ వెళ్ళిపోయింది.

దిండులో తలానించి చాలాసేపు వెక్కివెక్కి ఏడ్చింది జగదాంబ. గుండె కుదుటబడ్డం కష్టమైంది. సాయంత్రం కడవందుకుని నీళ్ళకొరకు బయలుదేరింది.

నలుగురైదుగురు ఆడవాళ్ళు కలిశారు. అంచరి గమ్యం దూ కులోళ్ల బావే. పశువుల అమ్మకాలు చర్చనీయాంశమైంది. చర్చాం తంలో—

"చూసి చూసి ప్రాణమోలె పెంచుకున్న పశువుల్ని కసాయోళ్ళ కమ్మితిని" అని విచారం వెలిబుచ్చింది కిష్టారెడ్డి భార్య సుగుణ.

వీపు మీద చర్నాకోల దెబ్బ పడినట్టయింది జగదాంబకు.

"కసాయోళ్ళా? కాదు సుగుణా! వాళ్ళు మంచి పట్నపోళ్ళటా?"

"బేరగాళ్ళు మంచి పట్నపోళ్ళే. కాని, మనూరి పశువుల్ని సక్కపోయింది మా తంరు దారంకు. అక్కడి అల్ కర్ ఫ్యాక్టరీకి. అది చాలా పెద్ద పశువధ్యశాలనట. అక్కడి నుండి పశువుల మాంసం వి శా లకు పంపుతారట." బుగ్గలు నొక్కుకుని చేతులూపుతూ చెప్పింది సుగుణ.

జగదాంబ బు రలో అటంబాంబు పేలింది. కాళ్ళలో వణకు బయలు రింది.

"అయితే, నా రామలక్ష్మణుల్ని గూడా...."

"మరింకెందుకనుకున్నావు? ఈపాటికి మన పశువుల మాంసం విమానమెక్కిపోయుంటుంది." ప్రతాపరెడ్డి కోడలంది - గాలికి విడిపోతున్న ముంగురుల్ని సవరించుకుంటూ.

పిచ్చెక్కినంత పనైపోతుంది - జగదాంబకు. నరాల్లో యుద్ధ వాతావరణం. ఆదరాబాదరాగా నీళ్ళు దీసుకుని ఇల్లు చేరింది. కడవ దించి మంచమ్మీద వాలిపోయింది.

నా చేతులు పడిపోనూ.... నా రామలక్ష ణులను యమదూతల కమ్మినానా? నా తుల్తో .. నా బిడ్డల్ని చంపుకున్నానా? ఏ జన ల ఏ పాపం జేసినో్నో.... భగవాన్.... నాకెందు శిక్ష?

బొటబొటా రాల్తున్న కన్నీటి నాపుకోవాలనిపించ- దు. గుండె చెరువైపోయింది.

....అల్ క ర్ ఫ్యాక్టరీ కత్తులు రామలక్ష్మణుల మెడల్ని పరపర కోస్తున్నాయి. అవి 'అంబా.... అంబా.... జగదాంబ త ల్లి!.... ఎంత పం శావమా .... నీకు దయలేదా?' అంటూ క స్తున్నాయి. తలలు తెగిన మొండాలు కొట్టుకుంటున్నై. తెగిన నరాల్లోంచి రక్తం కాలువలై పవహిస్తూంది. వాటి అణువణువూ తన, నిందిస్తుంది. తెగిన తలలు—

'మమ ల్ని కోతకప్పగించే బదులు నువ్వే గొంతు పిసికి చంపక పోయావా?' అని పశ్నిస్తున్నాయి. ఈ పాపం ఊరి పోదని శపి స్తున్నాయి. పాప తి ఒళ్ళంతా పాకి గుండెల్ని గట్టిగా పిండేస్తూంది. బాధ.... భరించరాని బాధ.

"రామా! లక్ష్మణా!" గుండె అరలు పగిలేలా అరిచి దిండుమీద ఒరెగిపోయింది.

ఈ రోజు గూడా కరవు రక్కసి కరాళ నృత్యాన్ని చూడలేనని దినకరుడు పడమటి గదిలో కెళ్ళాడు వి శాంతికొరకు. పకృతి నిర్దయకు నిరసనగా నల్లని తెరలు భూమ్మీదికి దిగిపోతున్నాయి.

"అమా ! అమ్మా! నీ మనవడెంత బావున్నాడనుకున్నావ్. అచ్చం నీ వోల్నే ఉన్నాడే...." అత్తారింటినుండి వచ్చిన మురళి మంచం దగ్గరి కొచ్చి అన్నాడు హుషారుగా. కొడుకు బుల్లిచేతులూ, బోసినవ్వులూ మెరిశాయతని కళ్ళల్లో.

తల్లి స్పందించలేదు.

"అబ్బా.... పగటి నిద్ర ఇంతసేపా?"" అసహనంతో తల్లి కాలును కదిపాడు. మాట్లాడలేదు. గాబరాగా చెయ్యి తడిమాడు. తల్లి ఒళ్ళు చల్లగా.... అతిచల్లగా.... మంచుముద్దలాగై పోయింది.

(ఇండియా టుడే 6-2 ఫిబ్రవరి, 995)

# కొత్త మెరుపు

నాగమణి నవ్వింది.

నది ఒడ్డున చెలిమ ఊటలా గుండె లోతుల్లోంచి తోసుకొచ్చే తరంగాల నాపుకోలేక ఉక్కిరిబిక్కిరై మొదటిసారి నవ్వింది.

నవ్వులో నవరత్నాలు కనిపించాయి నారాయణ తాతకు.

"ఏంది బిడ్డా ఉషారుగున్నవ్?"

తెల్లగడ్డం దువ్వుకున్నాడు చెట్లకు నీరుపారిస్తున్న తాత.

''నాకూ.... లు చుట్టుడొచ్చింది తాతా! ఆకు కత్తిరిస్తా, తంబాకు నింపుతా, దారంగడ్తా.... అన్ని వచ్చినయ్!'' బోనస్ అందుకున్న కా కురాలిలా సంబరపడింది.

''దొరల యా తల పుణ్యమాని గిదన్నా ర్చుకున్నవ్. వాల్లొచ్చే దాకా ఖుషీగుండు. వచ్చినంక మల్లా చెరల వడ్డటైకద బిడ్డా!'' చిరునవ్వును పెదాలమధ్య బిగపట్టి తన పనిలో నమయాడు.

గత పదిరోజులు నాగమణికి పది నిమిషాల్లా గడిచాయి. మరో ఐదు రోజులై మామూలు భాగోతమే. మళ్ళీ నరకయాత .

కోడికూతతో ని దలేచింది మొదలు రాత్రికి ఎక్కడివాళ్ళక్కడ గు రుపెట్టేదాకా యం తంలా పనిచెయ్యాలి. ఎవరిమాట కాదన్నా యమ యాతనే.

"నా తలకాయ మీద గీరాత ఎందుకు రాసినవ్ వుడా? ఇది నీకు నాయమా?" పొంగిన గుండెకోత ఎన్నోసార్లు వినిపించింది దేవునికి నాగమణి.

"బిడ్డా నాగూ! మయూరమ కు నిన్ను అరణంగా ఇస్తున్నారు. వాళ్ళత్తగారింటికాడనే ఉండాలె నువ్వు. మా తల్లి నన్ని ఇంటికి గట్లనే తోలిచ్చింది - వాళ్ళదొరల మాట కాదనలేక కంట తడిబెట్టిన తల్లి నొదిలి పెట్టి ఆ బంగళా చిన్నకోడలు మయూరి వెంట అరణంగా వచ్చినప్పుడు కడుపులో పేగుల్ని తెడ్డుతో కలియబెట్టినట్లైంది.

అక్కడ తన ఆరో ఏట తల్లిచాటు పిల్ల దొరల పిల్లల ఈసడింపు లకు రోషమొచ్చి-

" మా నాయన ఎవలమా ?" అనడిగింది తల్లిని.

కళ్ళ అంచులు దాటి చెంపల మీదికి జారబోతున్న నీటిధారల్ని బలవంతంగా ఆపుకుంటూ-

"అట్లా అడగద్దు నాగూ!" అంది తల్లి.

ఆ రోజు తల్లి అలాగెందుకందో ఈ బంగళాకొచ్చాక అనుభవం ద్వారా బోధపడింది.

మహారాజ భవనంలాగున్న బంగళాలో చిన్నమ వెంట అడుగు పెట్టేప్పుడు తనుగూడా అదృష్టజాతకురాలనుకుందో క్షణం. కాని ఆ తర్వాత బంగళా గడపదాటనివ్వరనీ బయటి పపంచాన్ని చూడనివ్వరనీ అనుకో దు.

పిల్లలూ పెద్దలూ అందరూ తనను నాగీ అనీ, పోరీ అనీ పిలిచినా బాధనిపించలేదు కాని....పప్పులో ఉప్పు తక్కువైందని పెద్దమ జడ బట్టి లాగి లెంపలు వాయించినప్పుడు సృష్టి వెనుకకు నడిచినట్టనిపించింది. కందిపోయిన చెంపల్ని పుణుక్కుంటూ మూడ్రోజు లేడ్చింది. నాల్గోరోజు మయూరమ మొగడు మొదటిసారి తన సర్వస్వాన్ని కొల్లగొట్టినప్పుడు ఆ విం మిటో సరిగా అర్థంగాలేదు. ఆ తర్వాత నడిపిదొర, పెద్దదొరల్ల

చేతుల్లో పులిబోనులో మేకపిల్లలా గిజగిజలా ంది. పిడిగుద్దులు లొంగ
దీశాయి.

తనలాగే తన కూతురు గూడా!

"మా నాయన ఎవరమ్మా?" అనడిగి ఏం జెప్పాలి? దాని కూతురు దాన్నడిగితే ఏంచెబ్తుంది? ఇదెన్ని తరాలు? అలోచించినప్పుడు అయోమయంలో కొట్టుకుపోతుంది.

పెద్ద దొరసాని తము డొచ్చాడోసారి. అతని సేవలకు తనను ప్రత్యేకంగా టాయించారు. సకల సదుపాయాల్లో భాగంగా తనను గూడా సమర్పించుకోక తప్పలేదు. ఉదయం అతని స్నానానికి నీళ్ళు సరిగా - డిచెయ్యలేదని పెద్ద దొర కొరడా తన వీపుమీద చిందులేసింది.

"బాంచెను దొరా .... కాల్మొక్త .... మళ్ళా కాగవెడ్త దొరా...." అన్న అరుపులు అరణ్యరోదనలైనాయి. సకల సదుపాయాలందుకున్నవాడి పెదవులమీద చిరునవ్వు కదలాడింది.

నడిపి దొరసాని చెల్లె వచ్చినప్పుడు అలంకరణ సామానులు త్వరగా అందించలేదని తన గూబ గుయ్యిమయింది.

వంట పనులు, ఇంటి పనులు, ఒంటి పనులు అన్నీ చెయ్యాలి- పట్టెడు మెతుకుల కోసం. దెబ్బలు గూడా నోరెత్తకుండా భరించాలి - జానెడు పొట్ట కోసం.

కాళ్ళు కడుక్కు-ందుకు నీళ్ళందివ్వలేదని చిన్న దొర, నారాయణ తాతను కరతో బాదుతుంటే నాగమణి రక్తం కుతకుతలాడింది. ఆడ పులిలా ఎగబడి చిన్న దొర గొంతు కసిక్కిన కొరికెయ్యాలనిపించింది.

"ఛీ పాపాత్ములు!" గొణుగుడు మయూరమ్మ చెవులబడింది. తనప్పుడు రెండు నెలల బాలింతరాలు. పిడి గుద్దులకు తోడు ఒక

రోజంతా బలవంతపు ఉపవాసం బహుమతి లభించింది. చంటిగుడ్డును రాత్రికి చంకల ర్చుకుని, గుండెలకు హత్తుకుని "నా కడుపుల ఎందుకు పుట్టినవు బిడ్డా?" అని బావురుమంది.

"మా అమ్మమ్మ దాసిది. మా అమ్మ దాసిది. - నూ అంతే. రేపు నువ్వు గూడా...." గుండెలవిసి కళ్ళు జలపాతాలైనాయి.

పదకొండు రోజుల క్రితం పెద్దదొరసాని పిలిచి "నాగీ! రేపు మేమంతా దక్షిణ యా తలకు బోతున్నాం. నుప్వూ, నారిగా ఉండాలె బంగ్లల. పదిహేను రోజులల్ల మల్లొస్తం. నువు బంగ్ల దాటి ఎటూ పోవద్దు తెలుసా?" అని చెప్పింది. గంగిరెద్దులా తలూపింది తను.

మర్నాడు వ్యాన్ మోటారొచ్చింది. వాళ్ళకు కావాల్సిన ఏర్పాట్లు - సేసరికి తల ప్రాణం తోకకొచ్చింది. అంతా వెళ్ళిపోయారు. ఊపిరి పీల్చుకుంది మనసారా.

"గీ పదిహేను రోజులన్నా నువ్వూ, నీ బిడ్డా, నూ రందిలేకుండ, దెబ్బలు దినకుండ ఉంటొచ్చు బిడ్డా!" నారాయణ తాత ముడతల మొహం మడిచిన తాటాకు విసనకర్రలా విప్పుకుంది.

"నా లెక్క నువ్వుగూడా ఎప్పుడూ బంగ్లల ఎందుకుంటున్నవ్ తాతా?" ఎన్నాళ్ళనుంచో అడగాలనుకున్న పశ్న అడిగింది.

"ఏంజెయ్యాలె బిడ్డా! మా నాయిన ఈ దొరల తం డి దగ్గర అప్పుదీసుకుని జీతమున్నడట. - నుగూడా...."

"మరి అప్పు దీరిందా లేదా?"

"అప్పు దీరిందిగని మా చాకిరి తప్పలేదు!"

"గదెట్లా?"

"వీళ్ళ దగ్గర పం సుడు బంద్ జెస్తే బొక్కలిరగగొట్టి పట్టు కొస్తరు. అంతా వాళ్ళిష్టమే. మనసుంటి పేదోళ్ళ గతి గింతే...." తాత నుదుటి అనుభవ రేఖలు అతుక్కుపోయి విడిపోతున్నాయి. "నువ్వు రాక ముందు . ను పని బంద్ స్తనని ఖచ్చితంగా చెప్పిన పెద్దొరకు. గప్పుడే ఇంతకు ముందున్న దాసీ ముండ పురుగుమందుదాగి సచ్చింది. అప్పుడది కడుపుతోనుండె పాపం! దానికి .. పురుగుమందు దాగిచ్చి సంపిన్ననీ, దానికి . ను కడుపు సిన్ననీ పో సులకు రిపోర్టిస్తమన్నరు. నా కాళ్ళు వొయ్యి కడుపుల జొచ్చినయ్."

"ఐ ఏం సినవ్ తాతా?"

"ఇం ం స్త? నేనిక్క జెన్మ సచ్చేదాకా ఉంటానని కాళ్ల్ మొక్కిన దొరలందరికి. గప్పుడు ఇడిసిపెట్టిం డు. వీళ్ళ లోకానికి దొరలు, మనకు దయ్యాలు బిడ్డా!" తాత కళ్ళల్లో మేఘాలు కరిగాయి.

"అమా !.... ఆకలే...." నాలుగేళ్ళ కూతురు జమున నాగమణి కొంగులాగింది. జమునకు అన్నం తినిపిస్తుంటే ఎదురింటి సుగుణమ్మ కళ్ళల్లో మెదిలింది.

వారం రోజుల క్రితం నారాయణ తాతకు జెప్పి మొదటిసారిగా బంగళా దాటి సుగుణమ్మ ఇంటికెళ్ళింది. లు చుడుతున్న సుగుణమా ఆమె కూతురు శకుంతలా సాదరంగా పిలిచి కూచోమన్నరు. చాయగూడా ఇచ్చారు.

"ఎప్పుడూ లేంది గి ంది బిడ్డా? ఆశ్చర్యపోయింది సుగుణమ .

"ఇంట్ల ఎవ్వలూ లేరుగదా? పాపం. పొద్దువోతలే మో?" శకుంతలే జవాబిచ్చింది, తన కళ్ళల్లోకి పరిశీలనగా చూస్తూ. సుగుణమ కుటుంబ సభ్యులంతా రోజూ బంగళా కొస్తుంటారు ఏదో ఒక పనిమీద.

"గీ బీ. లెట్ల - స్తరూ?" తన ఉత్సాహం నీరెండలా పొంగింది. శకుంతల అంతా వివరించి-

"నువ్వు గూడా నేర్చుకుంటవా?" అంది

". ర్చుకుంట." ఆసక్తి ఉబికొచ్చింది.

ఆకు కత్తిరించడం, పొగాకు నింపడం, దారం చుట్టడం.... రోజో పని ర్పింది. ఎవ్వరి సలహా లేకుండా లు చుట్టడమొచ్చేసింది. మొన్న లు చుడుతూంటే రాంరెడ్డి పటేలు భార్య వాళ్ళింటికి రమ్మన్నది. వాళ్ళు దొరగారి పొలాన్ని కౌలుకు స్తున్నారు. వెళ్ళింతర్వాత ఆమాటా ఈమాటా మాట్లాడ్తూ పప్పు రుబ్బమని పురమాయించింది. రుబ్బినందుకు రెం డూపాయలిచ్చింది బలవంతంగా-

నిన్న కరణం లక్ష్మమ్మ ఇంటికెళ్ళి బస్తా బియ్యం శుద్ధిచేసింది. ఆవిడ ఐదు రూపాయలిచ్చింది. తక్కువ పెట్టుబడితో అందరికంటే ఎక్కువ దిగుబడి సాధించిన రైతులా తృప్తిపడింది. తనలోని ఉత్సాహం ఏ. దో ఆలోచించింది.

కడుపునిండగా, గంతులేస్తూ తోటలోకెళ్ళి జామచెట్టుకింద నిల్చుంది జమున. కూతురు గంతుల్ని గమనిస్తూ నాగమణి నిల్చుంది వచ్చి.

"తాతా పిట్ట పిల్లల్లేవూ.... అయ్యో...." అరిచింది జమున. తన సొమ్మె వరో దోచినట్టు.

"ఇంకెందుకుంటయ్? రెక్కలొచ్చినై, ఎగిరిపోయినై!" నవ్వేశాడు తాత.

"ఎట్లా?...." జమున కళ్ళల్లో నిరాశ.

''పక్షి పిల్లలు రెక్కలు రాంగనే ఎగిరిపోతా యెటో. మనుషుల లెక్క అవి ఒకలమీద ఆధారపడుండయి. వాటి బతుకు అవి బతుకుతై." జమున బుగ్గమీద ముద్దులు వడ్డించిన తాత మొహమీద ఆనందరేఖలు మెరిశాయి.

నాగమణి గుండెల్లో, వెన్నెముకలో, నరాల్లో కొత్త మెరుపేదో జరున పాకింది. తాతవైపు విచితంగా దృక్కులు సారించింది.

o o o

పదహారో రోజు దక్షిణయాత్రల కెళ్ళిన వ్యాన్ తిరిగొచ్చింది-క్షేమంగా.

వ్యాను దిగుతూ -

"నాగీ....ఓ పోరీ....నాగీ!" పెద్ద దొరసాని పిలుపులు-కాదు అరుపులు.

బంగళాలో అడుగు పెడుతూ -

''ఎక్కడ చచ్చినవే నాగి ముండా! రా జ్దనీ....ఇవందుకో." పెద్దదొర రంకెలు.

నారాయణ తాత పరుగెత్తుకొచ్చి "నాగమణీ, దాని బిడ్డా మూడ్రోజులనుంచి కనవడతలేదు దొరా!" అని సవినయంగా విన్నవించుకున్నాడు.

(ఈనాడు, ఆదివారం 8 మే, 9

# ఎంగిలి మెతుకు

''పెళ్ళివాళ్ళొస్తున్నారమ్మా!'' కేకవేస్తూ హడావిడిగా ఇంట్లోకి పరుగెత్తుకొస్తున్న శాస్త్రిగారు, పంచె అంచు కాలి వేళ్ళలో ఇరుక్కొని గుమ్మంలో మొదలు నరికిన చెట్టులా పడిపోయారు.

సరిగ్గా ఆ సమయానికి పెళ్ళివారి రాకకోసం ఎదురుచూస్తూ నాగభూషణం వసారా నుంచి, వంటింట్లోంచి పార్వతమ్మ రామబాణాల్లా దూసుకొస్తూ ఒకరినొకరు కొని, నిలదొక్కుకోలేక అమాంతం శాస్త్రి గారి మీద పడిపోయారు. అప్పు లేవబోతున్న శాస్త్రిగారు ఏనుగు పాదం కింది అప్పడంలాగయ్యారు. పై ప్రాణాలు పైనే పోతున్నంత పనయింది.

"మహాప్రభో! - వండి!.... దంపతులిద్దరూ నా మీద పడిపో ....
అబ్బో....లేవండమ్మా !"

"అయ్యయ్యో!.... ఆ మీకా అల్లుడొస్తుండని మేము ఆగమై పోతుంటే.... గడపలో పండుకుని మీరట్లా అరిస్తే ఎట్లా పంతులూ?" లేచి పట్టుపంచ దులుపుకుంటున్నాడు నాగభూషణం.

"హమ్మో!" ఆయాసంతో లేస్తూ "ఇంకానయం, అమ్మాయి గూడా వచ్చి మన మీద పడ దు" అని పీతాంబరం సర్దుకుంటున్నది పార్వతమ్మ.

పెళ్ళికూతురు సులోచనకు నవ్వాగలేదు. చప్పట్లు చరుస్తూ విరగ బడి న-వ్వేస్తోంది.

పాతి ళ్ళ కితం పాత బస్టాండ్‌లో పకో లమి న నాగభూషణం హో మస్తాన్‌లా అంచెలంచెలుగా పెరిగి, ఏ క్లాసు కం ట్రాక్టరయ్యాడు.

ఇంజనీర్ల, ఇలవేల్పులుగా భావించి ధూప, దీప, నైవేద్యాలతో పసన్నం చేసుకోవడములో అతనికత సాటి. ఒక్క-ముక్క-లో చెప్పాలంటే కోటికి పడగెత్తాడు. నాల్గు చేతుల సంపాదన, ఐదంతస్తుల మేడ కట్టించాడు. ఇం దభవనంలాంటి మేడ. పార్వతను మెడనిండా పసిడి గలగలలు. ఆ పాలరాతి మేడలో అ. పనిగా తర్కి-ంచి, చర్చించిన దంపతులు తమ ఒక్క-గానొక్క- కూతురుకు అమెరికా అల్లుణ్ణి సంపాదించి రాలని ఏక గీవంగా రా నించుకున్నారు.

ఏక గీవ రా నం ఏకంగా - నాగభూషణం ఏకైక బాల్య స్నేహితుడు మహాలింగం చెవిలో పడిపోయింది. మహాలింగంది మహాబు ర. దుష్టరాజ యాల్లో తలపండిన సీనియర్ నాయకుడిలా అది స్పందించింది. అతని లువిడిచిన మేనబావొకడు ఎప్పుడో అమెరికాలో సెటిలైన సంగ , ఆ మేనబావకో కొడుకున్నాడన్న సంగ అర్జెంటుగా గుర్తుకొచ్చింది.

ఆలస్యమై అమృతం గూడా విషమై కూచుంటుంది గదా! యమర్జెంట్‌గా అమెరికాకు యస్టీ కొట్టేశాడు. కొడుక్కు- ఇండియా సంబంధం దొరికి , ఇల్లూవాకిలి విడిచిపెట్టి పరుగెత్తాలనుకున్న మేనబావ సంతోషం పట్టలేక ఎగిరి గం స్తున్నానన్నాడు. తన జబ్బ తా చరుచుకుని ఫోన్ జారవిడిచాడు. అతని కొడుకే ఫోనందుకుని -

"డియర్ మాయ్యా! హౌ ఈజ్ దట్ పోరీ?" అడిగాడు - నుడికారాన్ని మేళవించి.

"పోరికేందిరా మేనల్లుడా! పోరంబోకు తోటలోని నిమ్మపండు రంగూ, దొండపండు పెదాలూ, దానిమ్మ గింజల్లాంటి పలు వరుసా.... నాగుబామంత జడా...."

"వెరీ స్వీట్ మాయ్యా! పది రోజుల్లో మమ్మీ , డా ల నెత్తుకుని అక్కడి కొస్తా.... ఇంటర్వ్యూకు...."

విమానం దిగగా, అమెరికా అబ్బాయికి స్వాగతం పలికేందుకు మారుతి కారులో మహాలింగాన్ని పంపించాడు నాగభూషణం.

ఇంటిముందు కారాగకముం శాస్త్రిగారు పరుగెత్తుకొచ్చి అలా పడిపోయారు. నిజానికది వాళ్ళ కారు కాదు.

ఇరుగుపొరుగు వాళ్ళంతా కళ్ళప్పగించి గడపల్లో నిల్చుండి చూస్తున్నారు. అరగంటైంది.

అసలు కారొచ్చి ఆగింది.

పంచరంగుల అతుకుల ప్యాంటు, శరీరాని కతుక్కుపోయిన టీ షర్టు. గరికపోచల జుట్టు.... యువకుడొకాయన లోపలికొచ్చేశాడు. అతని వెంట మరొకాయన.... అ డెస్సు. జుట్టు మా తం కోతకొచ్చిపడి పోయిన వరిక రల్లాగుంది. వారి వెనకో స్త్రీ....మోకాళ్ళపైకి గౌను, బాబ్డ్ హెయిర్. పెదవులకు లిప్‌స్టిక్. కళ్ళకు చారెడు గాగుల్స్ ... అచ్చం సర్కస్‌లో ఆడబఫూన్‌లాగుంది. ఎవరి వయసెంతో ఊహించడం కష్టం. అందరి వెనక మహాలింగం.

"అమెరికా బాలాకుమారుణ్ణి తెస్తానని పగటి వేషగాళ్ళను పట్టు కొచ్చావేమిటయ్యా?" అప్పటి కుర్చీలో సెటిలైన శాస్త్రిగారు పంచాంగం మూసేసి నోరుదెరిచారు.

"పెళ్ళికొడుకూ, అతని తల్లిదండ్రులేరీ?" ఇంకా గడపవైపే చూస్తున్నాడు నాగభూషణం.

పక్కున నవ్వొచ్చింది మహాలింగంకు. మహాకాయం నెమ్మస్తున్న గేదె కదుపులా కదిలింది.

"నాకంటే ముందొచ్చినవాళ్ళు.... వాళ్ళేరా!" జబ్బపట్టి లోపలికి సుకొచ్చాడు, వచ్చిన వాళ్ళకు సోఫాలు చూపించి తాను కూచున్నాడు.

"అరెరే.... మరి వాళ్ళెటుబోయినట్టు?" వంటింట్లోంచి వస్తూ బుగ్గలు నొక్కుకుంది పార్వతమ .

అతుకుల పాంట్లూ, బాబ్డ్ హెయిర్ నవ్వుకుంటున్నారు.

"అయ్యో.... వీళ్ళు వాళ్ళే చెల్లాయ్!" పార్వతమ చెవిలో చెప్పేశాడు మహాలింగం.

"ఒరేయ్ వెధవా! బజారు దొంగల్ని పట్టుకొచ్చి అమెరికా బాబులంటావేమి టా?" తులు పిసుక్కున్నాడు నాగభూషణం.

"హాయ్ మున్నా! ఇన్‌సల్ట్.... అవమానం...." బాబ్డ్ హెయిర్ స్ప్రింగ్‌లా లేచింది. వెంట్రుకలు మొహమీద పడ్డంతో చింపాంజీ మొహంలాగైంది.

"నో సున్నా! మనమిది అభిమానం హన్కోవద్దు డియర్! మన పరిణయ ప తం వాళ్ళకు తెల్వాదు కదా!" బాబ్డ్ హెయిర్ చెయ్యిబట్టి కూచోబెట్టాడు పడుకున్న జుట్టాయన.

"అదే - పరిచయాలు ...." గొణిగాడు మహాలింగం యువకుని డొక్కలో చిన్నగా పొడిచి.

"యా మామ్! మనం మన పరిమాణాలు చెప్పుకుందాం....!" యువక్షుడి భుజాలు స్టైల్‌గా ఎగిరిపడ్డాయి.

"ఆ పని స్త్రాలెండి!" నవ్వుతూ ముందుకొచ్చాడు మహాలింగం. నాగభూషణం పక్కకొచ్చి తెరిచున్న పార్వతమ్మ నోరువైపు చూస్తున్నాడు.

గది తలుపు సందులోంచి కంటిరెప్పలు కదలకుండా చూస్తోంది సులోచన.

"అదిగో - ఆ పెద్దమనిషి మా బావ." పడుకున్న జుట్టాయనను చూపిస్తూ "మీకాబోయే వియ్యంకుడు. పేరు మర మనోహర్. ఆవిడే అతని ధర పత్ని శ్రీమతి సుమతీ మనోహర్. ప్రేమ ఎక్కువై తే పేర్లు పొట్టిగై పోయినై. మురళీమనోహర్ మున్నాగా, సుమ మనోహర్సున్నాగా ....అం రా నాగభూషణం!" నాగభూషణం వీపుమీద చరవబోయాడు. నాగభూషణం తప్పుకున్నాడు. ఆ చరుపు పార్వతమ భుజమీ దపడింది. నోరు తక్కున మూతపడింది.

"మరీ....మరి ఇతనెవరూ?" యువకునివైపు చూపిస్తూ అడిగింది.

"తంతా....!" గట్టిగా చెప్పి మరింత గట్టిగా న వ్వాడు గరిక పోసల యువకుడు. ఆ నవ్వు పిశాచం నవ్వులాగుంది.

కెవ్వున కేసి మహాలింగమీ ద పడిపోయింది పార్వతమ్మ. సోఫాలో పడుకోబెట్టారు. సులోచన గుండెలు బాదుకుంటూ నీళ్ళచెంబుతో పరుగెత్తుకొచ్చింది. మొహమ్మీద నీళ్ళు చిలకరించగా కలువ పూవుల్లా విచ్చుకున్నాయి పార్వతమ కళ్ళు. మెల్లిగా లేచి కూచుంది. తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు నాగభూషణం.

"చెల్లెమ్మా! జాగ త్తగా విను-" మహాలింగమందుకుని "ఇతని పేరు తంగిరాల తరుణ్కుమార్. ప్రేమగా తంత అంటారం . ఇతడే మీకాబోయే అల్లుడు." తాపీగా చెప్పాడు.

హమ్మయ్య, గండం గడిచింది అనుకుని గుండెమీద చెయ్యేసుకుంది సులోచన.

పెళ్ళికొడుకును చూస్తూ ముందు కడుగేసింది. ఆ అడుగు పెళ్ళి కొడుకు కాలుమీద పడింది.

"అమ్మో!" అంటూ సులోచన కాలు పట్టేశాడు.

"ఓరి భడవా పమాదమై అమ్మా, పమోదమై మామ్ అంటావా? ఒరేయ్! ఎందుకురా ఈ ఆత్మవంచన?" ఎసట్లో బియ్యంలా కుతకుతలాడి పోతోంది శాస్త్రి మనసు.

"అమ్మాయి కాళ్ళు పట్టుకు. రోజులు ముందున్నాయి నాయనా!" అనేశాడు.

"అయ్యయ్యో....అ మి టూ!" మహాలింగానికి స్గి సింది. పార్వ తమ్మ ముడుచుకుపోయింది.

"సారీ!" మున్నావైపు చూస్తూ నాజూగ్గా విడిపించుకుంది సులోచన.

"ఆ దృష్టి నా దిక్కు రానియ్ డియర్!" సులోచన చిలిపి చూపులు తనమీద పడనందుకు విసుక్కున్నాడు తంత.

తోసుకొచ్చే నవ్వు బలవంతాన ఆపుకుని -

"అయ్యో....అల్లుడు తంతా! పెళ్ళికూతురు ని. న్న చూస్తుందిరా నాయనా! అమా యి కి కాసింత మెల్లకన్ను అం !" అని చెప్పేశాడు.

"వెరీ ఫైన్. ఈ పంకజపక్షి మెడలో మూడు ముండ్లు స్తే మా సన్ను పైకిపోతాడన్నమాటా!" మురిసిపోయాడు మున్నా.

స్వీటు, హాటు అరగింపులై పోయాయి.

పెళ్ళి కూతురు కాఫీలందించి వొయ్యారంగా కూచుంది. వయసు పొంగులు సన్నని పైటలోంచి పొడుచుకొస్తున్నై. అందంగా అలంక రించుకుం మో - దేవకన్యలాగుంది.

"బ్యూటిఫుల్.... అమా యినో చూపు చూడు మైసన్" సున్నా పెదాలు చప్పరించింది.

CC-

"వెరీనైస్ మాడం! మీ నామకరణం చెయ్యండిహ." పెళ్ళికొడుకు హుషారుగా ముందుకు జరిగాడు. అద్దాలు సి మరీ చూశాడు తి. స్త్రా నన్నట్టు.

పెళ్ళికూతురు బి త్తరచూపులు.

"నీ పేరు చెప్పమ్మా!" మహాలింగం పళ్ళప్రదర్శన.

"ఓహ్.... నా పేరా! సులోచన." సులోచన గంటి చూపులు మున్నా మీదాడుతున్నై.

"మైడియర్ బేబీ! ఆ చూపుల్తో నన్ను టిఫిన్ చెయ్యకు" మున్నాకు సిగ్గేసింది.

"మా అమ్మాయి చూస్తుంది మిము ల్ని కాదు - మీ అబ్బాయినే అన్నగారూ!" వివరించింది పార్వతమ్మ.

"ఆహా.... ఎంత చక్కని చూపు! పేరు సులోచన.... వెతికి వెతికి పెట్టుంటారు త ్ల!"

శాస్త్రిగారు అభినందనకు తబ్బిబ్బైపోయింది సులోచన.

"హాయ్ డార్లింగ్!" పెళ్ళికొడుకులో ఉత్సాహం ఉబికొచ్చింది. "లెటజ్ హావ్ ఏ కిస్ మిస్!" చెక్కిళ్ళందుకోబోయాడు. చెంప చెళ్ళు మంది.

దిమ్మ దిరిగింది. కళ్ళు బైర్లుకమ్మినై.

"యూ.... నాటీ! నాకు మానభంగమైపోయింది.... ఇన్సల్ట్....!" సోఫాలో జారగిలిపడ్డాడు.

మహాలింగం గుండె గుబగుబలాడింది.

"ఇండియా గడ్డమీద పెళ్ళికి ముందు అవన్నీ కుదరవురా అల్లుడూ!" ఊరడించాడు వీపు నిమిరి.

ఒకరికొకరు సైగలు చేసుకుని పెద్దవాళ్ళంతా బయటికెళ్ళి పోయారు. పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు మిగిలిపోయారు.

సులోచన ఓరకంటితో గుమ ంవైపు చూచింది. ఆ చూపు తన మీద. పడిందని అర్థమైపోయింది తంతకు. అతని మొహం సర్ఫ్‌తో పిండిన మసిగుడ్డలాగైంది.

"ఆ.... అసలు కార్యం ఇప్పుడే డాళింగ్!" ఒక్క ఉదుటున లేచి సులోచన పక్కన కూచున్నాడు. భయం భయంగా పక్కకు జరిగింది. అమ ను పిలవాలనుకుంది. అప్పటికే ఆమె చేతులు తంత చేతుల్లో ఉన్నాయి.

"డోంట్ వ రీ డాళింగ్! మనమిట్లా ఎలోన్‌గా ఉంటే. శోభనం. మనకిట్ల అవకాశం గ్రాంట్ చెయ్యడం పెద్దవాళ్ళ విధి." భుజాలందుకో బోయాడు.

బెదిరిన లేడిలా ఎగిరి పక్కసోఫాలో కొచ్చింది. డొక్కలో తన్నినట్లైందతనికి. మూతి ముడుచుక్కూచున్నాడు ముంగిలా.

ఈ పెళ్ళికొడుకు కొంగలు పట్టేవాడో, కొంపలు నిలబెట్టేవాడో తెల్చుకోవాలిగదా! సులోచన బుర్రలో పాదరసంలా పాకింది ఆలోచన.

"మీ కింతకుముం ఆడవాళ్ళతో నన్నా సంబంధముందా?" ధైర్యంగా అడిగేసింది,

ఆహా! దారిలో కొస్తుంది ఇప్పుడే పట్టెయ్యాలి.

"వైనాట్ మైడియర్ స్వీట్ డాలింగ్? ఎంతో మంది గళ్ ఫ్రెండ్స్‌తో అనుభవముంది." గర్వంగా ఛా విరిచి మరీ చెప్పాడు. ఆ నోట "నువ్వు నీ బాయ్ ఫ్రెండ్స్‌తో టింగ్ చెయ్యలేదా?" అది కాదు,

"సులోచన ఒంటినిండా నల్లతాచులూ, ఎర్ర తేళ్లూ పాకినట్లైంది.

"మిస్టర్ తంత! నీ నడ్డివిరగతంత. దటీజ్ అమ్రికా." ఆమె ముక్కుపుటాలెగిరిపడ్తున్నై. కమ రితిత్తిలా గుండెలెగసి పడుతున్నై - కళ్ళు అగ్నిగోళాలైపోయినై-

తన నడుము చుట్టూ అల్లుకోబోతున్న అతని తుల్ని విసిరికొట్టి "అమా .... నాన్నా ....!" అనరిచింది.

పుట్టలోంచి మల్లా వచ్చారంతా.

"ఈ ఎంగిలిమెతుకు నాకొద్దు" చరచరా వెళ్ళిపోయింది సులోచన.

(25-5- 995, మహిళ, ఆంధ్రప్రభ అనుబంధం)

# అసలు నిజం

**మా** ఊరి పోస్టుమాస్టర్ నాకు బాగా తెలుసు. ఉత్తరాలు కొనుక్కొని అతన్తో మాట్లాడుతూ కూర్చున్నాను.

ఎవరో ఒక వ్యక్తి.... గాలికి కదిలే టేకు ఆకులా పదునైన నిక్కరూ, శరీరానికి అతుక్కుపోయిన షర్టూ, పెరిగిన గడ్డంతో నో అడ్మిషన్ బోర్డును లెక్కచేయకుండా లోపలికి చొచ్చుకొచ్చాడు.

ఎగాదిగా చూశాడు పోస్టుమాస్టరతన్ని. అంతేకాదు. అతడందించిన తెల్లకాగితమ్మీద పోస్టాఫీసు ముద్రవేసి.... "ఇదిగో రఘువీర్!.... ఇక వెళ్ళు" అంటూ ఇచ్చేశాడు.

నా గుండె ఝల్లుమంది. తెల్లకాగితమ్మీద ముద్రవేయడమంటే బ్లాంకు చెక్కుమీద సంతకం బెట్టడమే గదా! అతడి వాలకం నాలో ఆసక్తి రేకెత్తించింది. మారు మాట్లాడకుండా రఘువీర్ వెంటవెళ్ళాను. కో ఆపరేటివ్ బ్యాంకులో దూరాడతడు.

అదే కాగితమ్మీద కో ఆపరేటివ్ బాంకు మేనేజర్ సంతకం చేసిచ్చాడు.

అక్కణ్ణుంచి గబగబా స్టేట్ బ్యాంకులోకి.... స్టేట్ బ్యాంకు క్యాషియర్ రామారావు సదరు కాగితాన్నందుకుని ఒక రూపాయి బిళ్ళ రఘువీర్ చేతుల్లో ఉంచాడు.

ఖుషీగా గడ్డం నిమురుకుంటూ నిష్క్రమించాడు రఘువీర్. క్యాషియర్ రామారావు నా ప్రాణ స్నేహితుడు,

"అదేం కుదరదు...." విజృంభించబోయాను.

"ఎవరూ లేరా ఇంట్లో....?" అంటూ రామారావొచ్చాడప్పుడే.

పిడిప్పు రావాలా?....

మనోరమ గబగబా వెళ్ళి నా ప్రమోషన్ వార్త వాడి చెవిలో వేసింది. ఆలస్యమైతే కొంపలంటుకుపోతాయన్నట్టు.

"ఏరా మిత్ర ద్రోహీ! ఈ వార్త నిప్పటిదాకా దాచావు, ఏం బావు కుందామనుకున్నావురా?...." నిలదీశాడు.

"అం కాదు....వాడి రోజు కూడుబెట్టకు చెల్లెమ్మా!" అంటూ ఆదే శాలు గూడా జారీ శాడు.

"నిన్ను ఆఫీసులో కలిసి, ను మా ఆఫీసు కెళ్ళింతర్వాతనే ఈ వార్త తెలిసిందిరా.... అమ్మతోడు...." నా నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవాల్సివచ్చింది.

పెద్ద ఉద్యోగంలో జాయినయ్యే ముందు జబల్‌పూర్‌లో మూడు నెలలు ట్రైనింగ్. ఎల్లుండే ట్రైనింగ్ క్లాసులో రిపోర్టు చెయ్యాలి. ఆర్డర్ చదివి....

"ఐతే.... పదా సిన్మాకు. మనం మళ్ళ కలిసి సినిమా చూసే దెప్పుడో....!" అని సిన్మాకి లాక్కెళ్ళాడు.

సినిమా వదిలేసరికి తొమ్మిదైంది. సంగీతం, సాహిత్యం, నాట్యం సమపాళ్ళలో రంగరించిన రసగుళిక లాంటి సినిమా గురించి చర్చిస్తూ భోగేశ్వరాలయమందాకా వచ్చాం.

పదిహేను నెలల కితం భోగేశ్వరాలయంలో జంటహత్యలు జరిగాయి. అందు రాత్రి సమయాల్లో ఆ రూట్లో ఎవ్వరూ నడవరు. కాని, మా ఇళ్ళకదే షార్ట్‌కట్. గబగబా నడుస్తున్నాం.

పున్నమిరోజది. పచ్చిపాలు ఆరబోసినట్టు తెల్లని వెన్నెల. కాక ∙
యుల కళాతృష్ణకు అద్దం పడుతున్న ∙ వాలయ ప్రాకారాలను మెరిపింప
చేస్తున్న ఆ శు భజ్యోత్స్నకాంతులకు వీధిలైట్ల వెలుగులు వెలవెలబోతున్నై.

విచి తం.... వాలయంలోంచి వస్తోన్న సుమధుర సంగీతరవళి మా
చెవులకు ఇంపుగా సోకింది. కాళ్ళకు కులు పడినై. అ పయత్నంగా
లోపలికెళ్ళాం....ఆశ్చర్యం....అద్భుతం!

చల్లని వెన్నెలలో విశాలమైన మంటపం మీద, కాలుమీద కాలేసు
కుని రఘువీర్ గొంతెత్తి సంగీత సరస్వతికి నీరాజనా లర్పిస్తున్నాడు.

మమ్మల్ని చూడగా, దిగ్గున లేచి కూచున్నాడు.

"నువ్వా రఘువీర్....?! ఐ ....నువ్వు పిచ్చాడివి కావన్న మాట?!"
అడిగాడు రామారావు ఉద్వేగంగా.

రఘువీర్ శూన్యదృక్కులు ఆకాశంవైపు మళ్ళినై.

"హేమ్ రామ్!" గట్టిగా ఊపిరి వదుల్తూ స్తంభాని కొరిగాడు.

"మీరెవరూ?.... ఈ ఊళ్ళో ఎందుకుంటున్నారూ?" అడిగాను
ఆస క్తిగా.

మావైపు మళ్ళిన అతని దృష్టి వెనక ఎన్నో అగాధాలున్నట్టని
పించింది.

ఇద్దరం కూచుండిపోయాం.

"నా సంగతి మీకెందుకూ?" అన్నట్టుగా చూశాడు.

"ప్లీజ్, చెప్పండి. మీకు పిచ్చిలేదు గదూ?" అభ్యర్థనగా అడిగాడు
రామారావు.

"పూర్వం మాదీవూరే బాబూ!" రఘువీర్ గొంతులో గాం ర్యం....

ఐతా చంద్రయ్య

"నరరూప రాక్షసులైన రజాకార్ల చిత్రహింసలను భరించలేక మా తాత, నాన్నలీ ఊరుడిచి కాశ్మీర్ వెళ్ళారు. నేనప్పుడు చిన్నపిల్లవాణ్ణి. అదివరకే కాశ్మీర్లో స్థిరపడిన మా బంధువుల సహాయంతో మా నాన్న చిల్లరకొట్టు పెట్టాడు.

కాశ్మీర్ మహారాజు పుణ్యమాని అక్కడి ప్రజల్తో మేమూ కూడూ గుడ్డకు కొదవలేకుండా గడిపాం. తాత మరణించాడు. కాశ్మీర్ భారత్‌లో విలీనమైం తర్వాత మా కష్టాలు ప్రారంభమైనై. పాకిస్తాన్ మానస పుత్రుల ఆగడాలెక్కువైనై.

హిందువుల ఇళ్ళమీద దాడులు, దొంగతనాలు ఎక్కువైనై. హిందువులు దోపిడీలకు గురైనారు. రానురాను అత్యాచారాలు, మాన భంగాలు నిత్యకృత్యాలైపోయినై.

ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని రోజులు గడుపుతున్నా ఉగ్రవాద రాకాసి మూకలు పట్టపగ్గాలు లేకుండా విజృంభించాయి. పట్టపగలు నడి బజార్లో హత్యలు, చిత్రహింసలు, గృహదహనాలు మామూలైనై.

అంతెందుకూ.... కాశ్మీర్ లోయలో మన త్రివర్ణ పతాకమెగరదు. అసలక్కడ మమ్మల్ని అదుకునే నాథుడు లేడు. లక్షలాది మంది గాయాలతో ఆస్తిపాస్తులొదిలేసి పారిపొయ్యొచ్చారు. ఢిల్లీ పేవ్‌మెంట్ల మీద అడుక్కుతింటున్నారు. పోలీసుల లాఠీ దెబ్బలు భరించలేక ఎటెటో పారిపోతున్నారు.

ఓ రోజు.... మా ఇంటిమీద దాడి జరిగింది. మా నాన్న కాళ్ళూ చేతులు నరికేశారు. నా కళ్ళముందే నా భార్య మర్మావయవాల్లో కత్తులు దించారు. నా కూతుర్ని దారుణంగా చెరచి, ఆమె స్తనాలు కోసిపారేశారు.

వారంతా రక్తపుమడుగుల్లో కొట్టుకుంటూ పెట్టిన పెడబొబ్బలూ, చేసిన హాహాకారాలూ, చూసిన చూపులూ....నా గుండెల్లో అగ్నిపర్వతాలు బద్ధలైనై. అవిప్పటికి నా కళ్ళముందు సినిమా రీళ్ళలా తిరుగుతున్నై.

# సన్నాయి రాగాలు

"ఆఫీసరమ్మ రమ్మంటున్నారు సార్!"

మెల్లగా చెబుదామనుకున్న అటెండర్ ఐలయ్యా స్వరమాధుర్యం సెక్షన్లో అందరి వినబడింది.

కూడికలూ, ఇసి- తలతో కుస్తీపట్టేందు కుద్యుక్తుడౌతున్న ఎకౌం టెంట్ ప్రశాంత్ కుమార్ కరెంట్ తీసేసిన టీ.వీ. లాగైపోయాడు. చాన్నాళ్ళ తర్వాత సిటీ బస్సులో సీటు సంపాదించి ఆఫీసుకొచ్చిన సంతోషం చప్పబడిపోయింది.

ఆడపిల్ల కనబడి చాలు - అల్లరి పెట్టాలనే మనస్తత్వం జీర్ణించు కున్న యువకులకో ఛాలెంజ్ అతడు. ఆడవాసన కెంతదూరంలో ఉంటే సుఖసంతోషాలంత దగ్గరౌతాయని విన్నాడోసారి.

ఎదురుసీట్లో కాళ్ళాడిస్తూ కూచున్న వయాని దొంతపండు పెదా లకు చేతి గుడ్డ అడ్డంపెట్టి కిసుక్కుమంది. రోజూ ఆఫీసుకు రాగానే మలయమారుతంలా పలుకరించే దేవయానా! అలా నవ్వెం మిటి?

ఈ ఆడపిల్లలిం . సందు దొరికి చాలు - గారడివాడు పాముల నాడించినట్టు మగాళ్ళను ఆట పట్టిస్తారు. అసలూ.... మొగాడంటే బుట్ట కింద కమ్మిన కోడిపుంజో లేక ఊరేసిన మాగాయో అనుకుంటారేమో, నంజుకు తిందామన్నట్టు చూస్తారొక్కసారి.

తొలకరి జల్లు చల్లబడిన వాతావరణంలా లే ఆఫీసర్ కుమారి కృష్ణవేణి జాయినైన క్షణాన్నుంచి. దేవయాని మారిపోయింది. పూర్తిగా మారిపోయింది.

"ఆఫీసు కెప్పుడొచ్చారు?" ఆఫీసర్ చెవుల రింగులు చెట్టుమీది పువ్వుల్లా కదిలాయి.

కనీసం కూచోమ్మని గూడా అనడంలేదు. ఎంత టెక్కో! గుండెలమీద గుదిబండ మోస్తున్నట్టుందతనికి.

"ఇప్పు నం !" కూచోబోయి నిల్చున్నాడు.

"అంటే....? కాటుక కళ్ళు బండిచ కాలైనాయి. చేతిలోని కలం నున్నటి చెంప నానుకుంది. అదొక అపూర్వ దృశ్యం. ఆ దృశ్యాన్ని తనివిదీరా చూస్తే ఉద్యోగానికి ఉద్వాసన రావచ్చు. ఐనా, ఆడవాళ్ళతో వ్యవహారం గదా!

"సారీ.... సి- బస్.... ఆలస్యమైంది."

"కూచుని మాట్లాడొచ్చుగా!" కుర్చీ వెనక్కు చేరగిలబడింది. చెక్కిళ్ళు పాలరాయిలా మెరుస్తున్నాయి. ఉబికివచ్చిన వయసు పొంగులు ఎంతటివాణ్నైనా కవ్వించేలాగున్నాయి.

"అదికాదం !.... మీరు...."

"కూచొమ్మ . దాకా కూచోరన్నమాట?"

ర న కూచున్నాడు. పేము కుర్చీ ముళ్ళపాన్పైంది.

"మన బడ్జెట్ ఎస్టిమేట్ స్టేట్‌మెంట్సు త్వరగా పంపాలిగదా?" ముందుకి వంగి మొహంలోకి చూస్తోంది.

స్టేటుమెంట్స్ ఫైలు సంతకం కోసం ఆవిడ టేబుల్ మీ ముఱు స్తోంది, నన్ను చూడమంటూ.

చెవిటివాడిముందు శంఖమూది ఆ బొక్క నాకెందుకు చూపిస్తా నన్నట్టు ఎకౌంటెన్సీ గురించి ఈమెకేం దెల్సూ? ఫైలు ముందున్నా గుర్తింపడం లేదు.

"మీ ముందున్న ఫైలు అ నం !" అభిమానం పొడుచుకొచ్చింది.

అప్పుడే నవ్వడం ర్చిన రామచిలుకలా కిసుక్కుమంది. ఫైల్లోంచి కాయితం ఀసి అతని ముందుకు తోసి "మీరు కామర్స్ గాడ్యుయేట్ గదూ?" అంటూ కనురెప్పలెగరేసింది.

"ఔనండి! బికామ్ ఫస్ట్‌క్లాస్. ఐదేళ్ళ సర్వీసులో అకౌంటన్నీ అవ లగా పాసయానం !"

"వెరీగుడ్!"

భేష్! చిమ్మ కట్లో చిరుదివ్వె వెలిగింది.

"థాంక్సం !" మెలికలు తిరిగిపోతున్నాడు.

"కానీ, మన బడ్జెట్ ఫిగర్స్ లక్షల్లో ఉండాలి గదా?" కాయితం చూడమని కళ్ళతో చెప్పింది.

ఈ కాయితమిందులో కెలా వచ్చిందీ? మొహమీ ద ముచ్చెమట పొటమరిస్తూంది. చేతుల్లో సన్నని వణుకు. ఫిగర్స్ వందల్లో, పదులో ఉన్నాయి.

"ఇవీ....ఇవి స్టేట్‌మెంట్ ఫిగర్స్ కావం ! ఇంటి ఖర్చుల అంచనాలు. పొరపాటున....'' నాలుక తడారిపోతూంది. ఆ కాయితాన్ని నమలకుండా మింగెయ్యాలన్పించింది.

"మీ కెందరు పిల్లలూ?"

''పి....పిల్లలా? నాకింకా పెళ్ళే కాలేదం !"

"ఐతే....'' కృష్ణ ణి ముఖారవిందము పున్నమి చందమామైంది. '' ప్రేమ పంజరంలో చిక్కుకున్నారా?"

నేనెక్కడ ఇరుక్కుంటే ఈమెకెందుకో! మా....ప్రేమంటే... అబ్బో....ఒళ్ళంతా చెమటపట్టేస్తుంది.

"నువ్వూ మొగాడివేనా?" మొహం చిట్లించి పారిపోయింది. మళ్ళీ ఆతని జోలికి రాలేదు.

ఫైనలియర్లో మరో అనుభవం.

కాలేజీ కెళ్ళేప్పుడు ఎదురింటి విజయ దోరమాగిన మామిడి పండును దోచుకుతిందామనుకున్న తుంటరిలా చూపుల్తో తి. సేది. రోజూ గడపలో నిల్చుండేది. వోణీ అంచులు ముడేస్తూ చూపుల బాణాలు సూటిగా విసిరేది. పెదాలు వణి వి. సమ్మోహనాస్త్రానికి బందీయై అతడే పలుకరిస్తాడనుకుంది. ఆశ అడుగంటగానే తా పలుకరించింది. తుస్సుమన్న దీపావళి పటాకైందా ప్రయత్నం. మర్నాడు ధైర్యంగా ఎదురొచ్చి నిలుచుంది.

"కాలేజీ కెళ్తున్నారా?" గాలికి కదుల్తున్న గలా నడుము ఒయ్యారంగా మెలికలు తిరిగింది. తనను కాదన్నట్టు తప్పుకున్నాడు. కాల్ల నేలకేసి కొట్టి-

"ఛీ....పప్పుముద్ద!" అనేసింది.

అంతటితో ఊరుకోలేదావిడ. పేరును సార్థకం చేసుకోవాలని, పరీక్షాఫలితాలొచ్చిన రోజు అతని గదిలో ప్రత్యక్షమైంది.

కంగాట్స్ చెప్పి, బలవంతంగా చెయ్యి కలిపింది. అతని మెదడు మొద్దుబారింది. కాస్సేపు వెన్నుపూసలో వానపాము పాకింది.

"ఫస్ట్‌క్లాస్‌లో పాసయారుగా, పార్టీ ఏదీ?" సోయగాన్నంతా సొంతం చేసుకుని నిగనిగలాడుతున్న బుగ్గలు ఎరగులా లైనాయి. కళ్ళల్లో కమ్మని మెరుపు. రెస్పాన్స్ లేకపోతే మళ్ళీ పప్పుముద్దంటుందేమో! ఏదో ఒకటి మాట్లాడాలి.

'కష్టపడి చదివి క్లాసులో పాసయాను. మీరే నాకు-పార్టీ ఇవ్వాలి."

"అలాగా, ష్యూర్!" రెండు తుల్తో చెంపలు పట్టుకుని ముద్దులు వడ్డించింది. "ఐ లవ్ యు ప్రశాంత్!" అంటూ చెట్టునుంచి రాలిన పూవులా ఛాతి మీద ఒరిగిపోయింది. అంతరంగం నుండి ఉబికొచ్చిన శక్తి కదలనీయలేదు.

కిటి లోంచి కనబడిందమ్మకు.

"ఎవర్రా అమ్మాయి?" అంటూ పరుగెత్తుకొచ్చింది. వెంట బామ గూడా వుంది. విజయ తుర్రుమంది. నాన్న విషయం తెగా. అగ్గి మీద గుగ్గిలమైపోయాడు. చీవాట్లతో తల వాచిపోయింది. రా తికి భోంచెయ్యాలన్పించలేదు. బామ వచ్చి బుజ్జగించింది.

"గడుగ్గాయి పిల్ల సిగ్గు విడిచి అంతమాటంటే, నీ నోట్లో నాలుమైందిరా? ముంతకింది పప్పువై పోయావెందుకురా?"

"ఏం చెయ్యాలో తోచలే బామా !" ఏడుపొచ్చినంత పనైంది. నెత్తిమీద మొట్టికాయ వడ్డించి భోజనానికి సికెళ్ళింది.

ఉద్యోగంలో జాయినవగానే పెళ్ళిచూపుల కాహ్వానాలు రాసాగాయి.

పెళ్ళిచూపులా....? పెళ్ళిచూపులంటే, ముక్కూమొహం తెని ఆడదాన్ని ఇంటర్వ్యూ చెయ్యాలి. సిగ్గు విడిచి పశ్నలడగాలి, అడిగించుకోవాలి. అమ్మాయి నచ్చలేదంటే అమ్మాయికీ, ఆమె తల్లిదండులకూ బాధ. నచ్చిందంటే అమ్మా నాన్నకూ కట్నం నచ్చాలి. ప్చ్.... ఇదంతా సవ్యంగా జరిగి చివరకు మిగిలేది మెడకో గుదిబంట.

"పెళ్ళిచూపులంటే నాకు గిట్టవు!" కుండ బద్దలైపోయింది. ఎన్ని సార్లు కదిపినా అ సమాధానం.

ం ం ం

అస ప్రేమించేవాళ్ళెలా ప్రేమిస్తారో?.... పెళ్ళిదాకా ఎలా వస్తారో?.... ఈమధ్యే ప్రశాంత్ కుమార్ బుర్రను తొలిచేస్తుందా అను మానం. లంచవర్లో ఐలయ్య ముందుంచాడా అనుమానం.

"ఆ....దాం ముంది సార్!" వంద ప్రేమ సినిమాల్లో నటించిన బాక్సాఫీసు హీరో ఐపోయాడు ఐలయ్య. "తెగువతో మగువను పలుకరించాలి. తియ్యని మాటల్తో చిత్తు చేసి, కళ్ళల్లో కళ్ళు కలపాలి. మెల్లిగా దార్లోకి రాగానే బుట్టలో సుకోవాలి. చూపుల్తో తినెయ్యాలసలు. అసలు రహస్యమేమంటే ముద్దులాశించే ముందు గుద్దులు భరించేందుగ్గూడా రెడీగుండాలి." ప్రేమ పురాణం విప్పేశాడు.

ఇదో బాగాఁ ఉన్నట్టుంది. కాని, ఎక్కడ ప్రారంభించాలో....

"ఆడది తోడులేని జీవితం అడవి గాచిన వెన్నెల సార్!" మూలమంతోప్రశమైంది.

చిక్కు వీడని కురుల్లా ఊహ లేవో చుట్టుకుపోతున్నాయప్పుడే.

"అంతేనంటావా ఐలయ్యా?"

"అదంతేగానీ....ఈమధ్య మీలో ఏదో మార్పు కన్పిస్తుంది సార్! దేవయానమ్మా, జయంతమ్మమా అదోలా చూస్తున్నారు. అంతా గమనిస్తున్నాను సార్!"

కాఫీ డబ్బులు వసూలు చేసుకున్నాడు.

సీటు వద్దకు రాగా, చాంబర్లోంచి పిలుపొచ్చింది.

"డి.ఏ. అరియర్స్ బిల్ ఇన్ టైంలో చేయించారు. వెరీగుడ్!" అప్పుడే విచ్చుకున్న ముద్దమందారంలాగుంది కృష్ణవేణి మొహం. కాటుక కళ్ళు గండుతుమెదల్లా కదుల్తూంటే నుదుటి సిందూరం వాటిని కంట్రోల్ చేస్తుంది. జడలోని మల్లెచెండ గుండెల మీదాడుకుంటుంది.

"నా సెక్షన్లో దేవయానీ,జయంతిగారలు సిన్సియర్ వర్కర్సం !" మల్లెదండమీద వాలాయి చూపులు.

"ఔనూ....ఇద్దరు యువతుల మధ్య పంజెయ్యడం మీకెలాగుంది?" సన్నటి పెదాలకు నున్నటికలం తాకింది.

పర్వాలేదు. ఈవిడ సరదా మనిషే. ధైర్యం జబ్బ చరిచింది.

"హలో కృష్ణా!" హెచ్చరికలేని తుపాన్లా చొచ్చుకొచ్చాడో యువకుడు. వీడెవడో ఇప్పుడే రావాలా?

"హలో బావా!" కృష్ణవేణి - చి నిలబడింది. ఎదురెళ్ళి నూటు సం టుకుంది. వచ్చినాయన ఆవిడ మేనబావ సుభాషనీ, మిలటరీ ఆఫీసరనీ పరిచయంలో లింది.

"ఉత్తరమందిందా బావా?" మోచేతులు టేబుల్మీ దానించి ముందుకు వంగింది.

"అందింది. ఈసారి పెళ్ళి చేసుకుని జంటగా వెళ్దామనే వచ్చా!"

నవ్వుకున్నారిద్దరూ.

హానరంలో పుడకలా తానెందుకూ? బయటికొస్తుంటే వయాని కొట్టింది. కొత్త వీణను శృతిచేసినట్టు సరాలు జివ్వుమన్నాయి. ఫైలు ంచెలకు హత్తుకుని చాంబర్లో కెళ్ళబోతుందావిడ.

"నన్నెందుకు కాపాడు సార్?" కళ్ళతో ప్రశ్నించింది, చెంపలమీది ముంగురుల్ని సవరించుకోకుండా.

ఆ ముంగురుల్ని సవరించే సన్నుతాంగుడెవడో....ఆ కనుగవ్వల రాంతిప్రంజాల నేడకా, అదృష్టవంతుడెవడో?!

"అలా....కొత్తగా చూస్తున్నారేమిటి సార్?" పైట భుజాలు కప్పే సింది.

"లోపల ఆఫీసర్‌గారి మేనబావున్నారు. వా దో సరదాగా...."

"అంతేనా?" మాట విరిచేసి మూతిని మూడు వంకర్లు తిప్పేసింది. అదో బ్యూటీ స్వీ న్స్.

"అంటే....?"

"మీ మన్నా అక్షంతలు పడ్డాయనుకున్నాను."

"అక్షంతలు వేసేందుకు తప్ప మరెందుకూ పిలిపించరా నన్ను కృష్ణవేణిగారు?" ఉ కోషం పొడుచుకొచ్చింది.

"ఆహా! ఐ , వేరే పనులగ్గూడా పిలిపించుకుంటారుగదూ!" ఒత్తి పలికి చాంబర్లోకి దూసుకుపోయింది.

మొదటి కాం టాక్టులో, మొత్తం నష్టపోయిన కాంట్రాక్టరులా గయిందతని వాలకం.

సీటువద్దకు రాగా —

"మీరు ఏకంగా మనాఫీసరమ్మనే ప్రేమించెయ్యండి సార్!" అని సలహా పారేసి మెలికలు తిరిగిపోతున్నాడు ఐలయ్య. పక్కనున్న జయంతి పక్కున నవ్వింది.

"యూ షటప్ అండ్ గెటౌట్ ఐలయ్యా!" కాంప్లెక్సు పొడుసు కొచ్చింది. జయంతి నవ్వు ఆర్పేసిన లైటులా ఆగిపోయింది.

o o o

"ఈ రోజు మీరు కృష్ణ ణిగారింటికొస్తున్నారు" అంది వయాని పశాంత్ కుమార్తో.

"ఎందుకూ?"

"ఆవిడ పెళ్ళి సెటిలైపోయింది. నాది గూడా సెటిలైపోయింది. ఈ రోజు సాయంతం వాళ్ళింట్లో రెండు పెళ్ళిళ్ళకి నిశ్చితార్థాలు. మీరు తప్పక రావాలి."

"అరె .... అందరి పెళ్ళిళ్ళైపో .... ఇహ మిగిలేదెవరూ?" పక్క నున్న జయంతివైపు మళ్ళాయతని చూపులు.

"వచ్చే సోమవారం నా పెళ్ళి. మీరు తప్పకుండా రావాలి సార్!" శుభలేఖ అందించింది జయంతి. జయంతి పక్కన కృష్ణవేణి నిలుచుంది.

"ఆ.... మీరా?" స్ప్రింగ్‌లా లేచాడు. కృష్ణ ణి గలగలా నవ్వింది. నవ్వుకాదది. మేలిమి ముత్యాలజల్లు. కాని, ఆఫీసరలా ఎందుకు నవ్వినట్టో....!

యవ్వనం తాలూకు మెరుపులన్నీ కృష్ణ ణిలో ఉన్నాయి. ముద్దుగా, కుందనబొమ్మ లాగుంది.

"సాయంత్రం మా ఇంటికి తప్పక రావాలి!" అంటూ వయ్యారంగా వెనుదిరిగి రాజహంసలా అడుగు స్తుంది.

"ఐనా.... మీ పెళ్ళికి నిశ్చితార్థం ఆఫీసర్ గారింట్లోనా?" దేవయాని నడుగుదామనుకునే లోపలే వెళ్ళిపోయింది కృష్ణ ణి వెంట.

o o o

కృష్ణవేణి ఇల్లు సందడిగా ఉంది. సుభాష్ ఎదురొచ్చి స్వాగతం పలికాడు పశాంత్ కుమార్‌కు.

కెట్ మ్యాచ్‌లో సెంచరీ చేస్తానని పతిజ్ఞ సి మొదటి బాల్‌కే ఔటైన మేటి బ్యాట్స్‌మెన్‌లాగుంది పశాంత్‌కుమార్ పరిస్థితి.

"కంగ్రాట్స్.... అదృష్టవంతులు" అనేశాడు సుభాష్‌తో.

"థాంక్స్.... ఎక్స్‌క్యూజ్ మీ...." మరోవైపు నడిచాడు సుభాష్ ఇంకెవర్నో రిసీవ్ చేసుకునేందుకు.

సహారా ఎడారిలో మిట్ట మధ్యాహ్నం ఒంటరి పయాణంలాగే ఉంది తన బతుకు.... ప్చ్.... నిరాశ నిలదీసింది.

"స్వాగతం.... సుస్వాగతం సార్!" అప్సరసలా కనబడింది దేవయాని. చిరునవ్వు పెదాలకతికించుకోక తప్పలేదు.

"మీకాబోయే భర్తను పరిచయం చెయ్యరా?"

"నాకాబోయే భర్త సుభాష్ గారం !"

"ఆయన కృష్ణవేణిగారి మేనబావగదా?!''

"నిజమే...." కృష్ణవేణితో తిరిగొచ్చిన సుభాష్ అందుకున్నాడు: "కృష్ణవేణీ నేనూ వరుసకు బావా మరదళ్ళమే కాని వ్యవహారానికి పూ తం అన్నా చెల్లెళ్ళం. దేవయానీ నూ ఒకే కాలేజీలో చదువు కున్నాం. అప్పుడే మా ప్రేమ మొగ్గదొడిగింది."

"ఇప్పుడు వికసించింది." కృష్ణవేణి పెదాల మీద దరహాస చంద్రి కలు పశాంత్‌కుమార్ నల్లరి పెడ్తున్నాయి. కాని.... ఇదో మాయా లోకం. ఇక్కడంతా అయోమయం.

"మరి కృష్ణవేణి గారికాబోయే...."

"అది మీ బామ్మగారి నడగండి!" చిన్నపిల్లలా కిసుక్కుమంది కృష్ణవేణి.

అరె.... బామ్మ.... ఎప్పుడొచ్చిందీ? ఎందుకొచ్చిందీ?!

''నువ్వెందుకొచ్చావే బామా ?"

"ఇదేం చోద్యంరా! నా మనవని నిశ్చితార్థానికి ను రావద్దా?" బుగ్గలు నొక్కుకుంది బామ్మ.

బాక్సాఫీసు బద్దలు కొట్టాలనే దురాశతో కథనంతా గందరగోళం చేసుకున్న సినీ నిరా తయాడు.

"ఈవిడ మా బామ సీతమ్మ!" మరో ముసలమ ను పరిచయం సింది కృష్ణ-ణి.

"అబ్బాయి చాకులాగున్నా !" సీతమ ప్రశంస.

"ఇదంతా ఏమిటే బామా !"జుట్టు పీక్కోవాలనిపించింది ప్రశాంత్ కుమార్‌కు.

"సీతమ్మా, నూ రోజూ గుడిలో కలుసుకుంటున్నాంరా! నీ విషయం గురిం , కృష్ణ జి ధైర్యం గురిం మాట్లాడుకున్నాం. ముం నీకు తెలిస్తే ముందట్లాగా కొంప ముంచేస్తావని మేమంతా కూడబలు క్కుని కృష్ణవేణి , నీకూ పెళ్ళి నిర్ణయించాంరా! ఈరోజు నిశ్చితార్థం. వారం రోజుల్లో సన్నాయిరాగాలు....సంవత్సరం తిరిగేలోగా నాకో ముని మనవడు...." బామ మాటలు బంగారు మూటల్లాగున్నాయి.

"అరె....అమా , నాన్నలు కూడా వచ్చారే!" గుఱ్ఱప్పందాల్లో జాక్‌పాట్ కొట్టేసినట్టనిపిస్తోంది. కృష్ణ జి బుగ్గలమీద సిగ్గుల సింగారం.

(మయూరి వీ , 25 ఆగస్టు, -5)

# అరచేతిలో వైకుంఠం

''సత్తక్కా....ఓ సత్తక్కా!''

గుడిసెముందు నిండుగా ప్రవహిస్తున్న కాలువను ఒకే అంగలో గెంతి బాణంలా దూసుకొచ్చాడు రాజారాం. ఇద్దరు కూతుళ్ళ పెళ్ళి ఒకే ముహూర్తానికి చెయ్యబోతున్న తండ్రిలా హడావుడి పడుతున్నాడు.

''సత్తక్కా! ఇయ్యాల మా పార్టీసభ జేత్తున్నరే. నువ్వూ, రంగడు తప్పక రావాలె. మరువొద్దూ....ఆఁ!'' ఆదరాబాదరాగా చెప్పి వెళ్ళబోతున్న రాజారాంకు అనుమానం సోకింది.

''మాట్లాడ-మే! వస్తావా, రావా?'' అడిగాడు వెనుదిరిగి.

పేరున్న పైరవీకారుగా ఆ బస్తీలో రాజారాం అందరి తెలుసు. వయస్సు ముప్పయైదు. ఎప్పుడు ఎన్నికలొచ్చినా మొగ్గమీద ఆసువోసే కండెలా అటూ ఇటూ తిరుగుతుంటాడు. ఏదో ఒక పార్టీ కార్యకర్తగా వెలిగిపోతుంటాడు. అక్షరంముక్క లంటకపోయినా అపారమైన తెలివి తేటలున్నాయనుకుంటాడు తనకుతాను.

''ఏమైం సత్తక్కా?....రంగ ?''

నిట్టూర్చింది సత్తక్క అనబడే సత్యలక్ష్మి. ఆవిడ చూపులు శూన్యంలోకి చొచ్చుకుపోతున్నై.

నాగరికతకు నిలయమైన మహానగరంలో అభివృద్ధి చెందుతున్న ఒకానొక మురికివాడ అది. ఆ మురికివాడలో మెయిన్‌రోడ్డు. దాని పక్కన నాగరికుల కంపును జాగ్రత్తగా మోసుకొస్తున్న పెద్ద కాల్వ- కాకతీయ కాల్వ కంటే ఏ మాత్రం తీసిపోనంటుంది. నగరంలోని మురికి నీరంతా

అక్క సంగమించి కాళ్ళకు గజ్జెలు కట్టుకుని పరుగులు దీస్తుంది. ఎన్నో పిల్ల కాల్వలకు తల్లి కాల్వ - ఆ పెద్ద కాల్వ. కాల్వల పక్కన గుడిసెలు. గుడిసెల మధ్యన రేకు డబ్బాల ఇండ్లు. ఏరిపారేసినట్టు అక్కడొకటి ఇక్కడొకటి పెంకుటిండ్లు గూడాను. సత్యలక్ష్మి గుడిసెకు రెండు పక్కలా కాల్వలున్నై. అవి జీవనదుల్లా పవహిస్తుంటై. నడి ఎండా కాలంలో మిట్ట మధ్యాహ్నం సూర్యప్రతాపం తగ్గిం తగ్గవచ్చు కానీ, ఆ కాల్వల్లో నీటి మట్టం మా తం తగ్గదు. మూడుపూవు లారుకాయలుగా కాపురాలు చేసుకుంటున్న దోమలు దివారా తాలు రాగాలు విన్పిస్తుంటై. వీరవిహారం చేస్తుంటై. ఇళ్ళలోకి నిరాటంకంగా ప శించి మనుషుల రక్తం పీలుస్తూ దాగుడు మూతలాడుకుంటుంటై. దోమలకూ వాటి మి త పక్షాలైన పందులకూ నిత్యకళ్యాణం పచ్చతోరణమక్కడ.

పిల్ల కాల్వల్లో జలకాలాడి ఒడ్డుమీద ఠీవిగా నడుస్తున్న పందులు మనిషి కంటబడగా అసహ్యించుకుంటాయి. నిరసనగా భరత నాట్య భంగిమలు చూపిస్తై. అందుకే తెల్లగుడ్డల శా_లేవీ సంచరించవక్కడ.

ఏది ఏమైనా ఎన్నిల పుణ్యమాని సంచలనం కనబడుతుంది. బస్తీ లోని పైరవీ రాయుళ్ళూ, సన్నకారు నాయకులూ విసుగూ విరామం లేకుండా మొగ్గ లేస్తుంటారు. పెద్ద నాయకు డొచ్చేముందు - వీధుల్ని శు భంగా ఊడ్పించి, కాల్వల్లో ఫినాయిల్ డబ్బాలు కుమ రించి, ఒడ్డున రకరకాల పౌడర్లు చల్లిస్తారు మున్సిపాల్టి పెద్దలు. ఎంత సినా పెద్ద నాయకుని చేతిగుడ్డ ముక్కుముందే ఉండి తీరుతుంది.

"ఊఁ....ఆఁ .... అబ్బా.... అమా ...." గుడిసె మూలనుండి మూల్గులు. సత్యలక్షి చూపులటువైపు తిరిగినై.

"అద్దిగో .... రంగడక్కడ పడున్న"డని కళ్ళతో చూపించిందది

''వాని మైందక్కా?'' రాజారాం గొంతు నార్మలైంది.

''పదిరోజ్నుంచీ జొరం. అప్పుడే చలొస్తుంది ఎంటనే గరం రొట్టె పెంకోలై పోతడు....పెయ్యి మీద చెయ్యేస్తే సుర్రుమంటది.... తెల్లందాకా నిద్రలేదు....ఒక్కటే మూల్గుడు....శానా పరేశానై పోతుంది.." నిట్టెండకాలం మున్సిపల్ కుళాయిలోంచి రాల్తున్న నీటిబొట్లలా సత్య లక్షి గొంతులోంచి మాటలు ఆగిఆగి వస్తున్నై. రెండుకళ్ళూ వానాకాలం చెరువులై పోయినై.

"ఒక్క ఇంట్ల గింత సేపుంటె ఎట్లా?'' రాజారాం అంతరంగం అల్లరి పెట్టింది. ఎందుకైనా మంచిదని—

"అయ్యో పాపం! దావకాన్ల జూపియ్య లేదా?'' సానుభూతి జాలువారింది.

''మొన్న తోల్కపోయిన సర్కారు దావకాన్లకు. నాల్గుగంటలు లైన్ల నిల్చుండవెట్టి రెండు గోలిచ్చి పొమన్నరు. ఆ గోలు ఏ మూలకు వోయినయో....జొరం ఎక్కువనే అయింది....''

''గట్టనా....?'' ఒంటికాలు మీదున్నడు రాజారాం.

''ఔను....మా అయ్య, మీ బావా గిసొంటి జొరాలతో సచ్చి పోయిండు గదా!....'' సత్యలక్షి కళ్ళు శ్రావణ మేఘాలైనై. కను కొలుకుల్లోంచి రాలిన నీటిబొట్లు లమీద రాలి ఇంకిపోతున్నై.

''వాళ్ళేకా ....ఇంక శానామంది గిసొంటి జొరాల్తోని పరేశానై తున్నరు. ఆ దేవుని ల....ఏం ద్దామక్కా?'' చేతులు పిసుక్కున్నడు.

రెండు నిమిషాలు....ఏం మాట్లాడాలో ఎవరికి తోచలేదు.

"రంగడి ం గాదు గానీ, సభకు మీ యవ్వను గూడా దోల్కరా! మీ ఇంట్ల మూడు ఓట్లున్నై గదా!'' అంటూ వెళ్ళబోతున్న రాజారాం భుజమీద చెయ్యేసి ఆపింది.

"మన గ్రామాలను బాగ త్తమని ఓట్లు వచ్చినప్పుడల్లా జెప్తున్నారు గదా! ఇక్కడొక దవాఖాన గూడా పెట్టిస్తమని గదా!...." సత్యలక్ష్మి మాటల్ని మధ్యలో తుంచేసి—

"ఓహో.... మురికివాడల అభివృద్ధి గదా!.... అన్నారు. నిజమే...." అని లోపలి కోపాన్ని బయటికి రానీయకుండా జాగత్త పడ్తున్నాడు.

"ఔను.... పోయిన యాడాది బల్దియా ఓట్లప్పుడూ, రెండేండ్ల కిందోసారి, మూడేండ్ల కిందోసారి ఓట్లడిగినప్పుడు నువ్వు గూడా జెప్తివి గద రాజారాం" ఏవేవో గుర్తుకొస్తున్నాయావిడకు.

"మరి....మా పెద్దలు దరు జెప్పుమంటే న్ జెప్పిన." కోపతాపం హద్దులు దాటుతుంది....". మన్నా నా కొరకు ఓట్లడిగిన్నా? మీరేమన్నా పుణ్యానికేసిండ్రా?.... మన మురికివాడల్ని అభివృద్ధి స్తమని ఇప్పుడు కూడా అంటున్నాం గదా!" భుజమీది చెయ్యి లాగెయ్యబోయాడు. ప్రయత్నం విఫలమైంది.

"గాని.... ఒక్క పది రూపాయలూ...." మరో చెయ్యి ముందుకు చాచింది.

"మీరు మాత్రం సభకు రావాలె.... రంగడి కింత జావదాగిచ్చి తోల్కరా.... నీ యవ్వ...." విదిలించుకుని వెళ్ళిపోయాడు.... కాదు.... పారిపోయాడు.

o o o

సముద్రములో అల్పపీడన సమయంలో - కోస్తా ప్రాంతాల్లో వర్షంలా - మైకుల హోరు, కాసెట్ల జోరుతో ఎన్నికల ప్రచారం ఊపందుకుంది. మురికివాడల్లో గూడా కాసెట్ల రిక్షాలు గొంతులు చించుకుంటున్నై.

పార్టీ నాయకుల ఉపన్యాసాలూ, సినిమా డైలాగులతో బస్తీ జనాల చెవులకు తూట్లు పొడుస్తున్నై.

సాయంత్రమైంది. అందరి ఇళ్ళల్లోకి వినబడేలా సభాస్థలి మైకు మొత్తుకుంటుంది.

''మహా ప్రజలారా! మురికివాడలల్లా మురికి జీవితం గడుపుతున్న మీకు దండాలు. ఇలాంటి మురికివాడలు మన దేశంలో బొచ్చెడున్నై కాబట్టే మనది ద దేశమంటుంద్రు అని మనవి త్తున్నా. ఐతే.... ఈ మురికివాడల్ని అభివృద్ధి చెయ్యాలనే మా పార్టీ కంకణం కట్టుకుందని మరోసారి మనవి త్తున్నా....'' నాయకుని ఉపన్యాసం సాగిపోతుంది.

ఒక కుర్రకుంక చెడ్డి సర్దుకుంటూ లేచాడు.

''ఇప్పుడున్న మురికివాడలు చాలవా?'' గట్టిగా అరిచాడు.

నాయకమణి గొంతులో పచ్చి వెలక్కాయ పడింది. గొంతు సవరించుకోక తప్పలేదు.

"....మహాజనులారా! మా పార్టీ ఉద్దేశ్యం - మురికివాడల మురికినంతా సాఫ్ సి ్లన్‌గా ఉంచాలని సవినయంగా మనవి త్తున్నా." గొంతు స్థాయి మరింత పెరిగింది. ''ఈ గుడిసెలన్నీ పీకేయిత్తాం...."

"గుడిసెల్ని పీకెయ్యటంలో మీకు మీరే సాటిగదా!" సభలోంచి వినబడింది.

"అది కాదని మనవి త్తున్నా.... ఐ- .... మహాషయులారా...."

తన గుడిసెకు కొద్ది దూరంలో జరుగుతున్న సభను తిలకిస్తూ అంతా వింటుంది సత్యలక్ష్మి.

''అమ్మా .... చలి.... అమ మ్మో.... చ.... .... హయ్యో...." లోపల్నుండి రంగడి మూల్గులు వినబడినై.

"మల్లా వొచ్చిందా మాయదారి చలిజ్వొరం...." గొణుక్కుంటూ లోపలికెళ్ళి గొంగడి, దుప్పటి కలిసి కప్పేసింది.... "ఏనుగోలున్నోవిడి పీనుగోలైనవు కొడుకా, నేం జెయాలా దేముడా! ఎటువోవాల్రా దేముడా! మా ముసల్ది గూడా లేకపోయే....''

మెలికలు తిరిగిపోతున్న రంగడి అవస్త చూడలేక చేతులు పిసుక్కుంటుంది. కడపులోని పేగుల్ని కరకర కోసినట్టనిపించింది. కొంగు నోటికడ్డంబెట్టుకుని ఏడుస్తూ కూచుంది.

"....ఐ ....మహాజనులారా! ఈ మురికివాడల ఒక దవాఖాన పెట్టించాలని మా పార్టీ నిర్ణయించిందని సగర్వంగా విన్నవించు కుంటున్నా. గవర్నమెంటుతోని కొట్లాడైనా సరే...." ఉపన్యాసం గుడిసె లోకి చొచ్చుకొస్తుంది.

''అబ్బా .... ను వ్వద్వకే. అమ మ ఊరి నుంచి ఎప్పుడొత్తదే! అయ్యో...అమో ....గ ....పెయ్యిని పొయ్యల వెట్టినట్టుంది....కాళ్ళూ చేతులూ....యాతంబోస్తునై. తలకాయ పల్గిపోతుంది.''కప్పుకున్నవన్నీ తన్నిపా శాడు రంగడు. నరాల్లోని సత్తువంతా జ్వరానికాహారమైంది. మొహం నల్లబడింది.

''హమ్మా! నువ్వు నన్నుజూచి .... పరేశాన్ కావ్ద ...." బోడ బావిలోంచి వచ్చినట్టున్నాయా మాటలు.

రంగడి శరీరమీ ద చెయ్యేసి వెంట. వెనక్కు లాక్కుంది.

''ఈ జస్తీల దవాఖాన పెడ్తమని ఎన్నోసార్లన్నరు ముండాకొడు కులు....దవాఖాన లేదూ, దివాన్‌ఖాన లేదు...." గొణుక్కుంటూ తడిగుడ్డ పెట్టి నుదుటిమీద ఉంచింది.

సత్యలక్ష్మి కార్మికురాలు. రోజూ రెండు ల బీ ఉదాకా చెయ్యగలదు. రంగడు ఫ్యాక్టరీ కార్మికుడు. ఓ కా. కుల కూ ,రేట్లు పెంచాలని సమె ప్రారంభమై నెలరోజులైంది. పూట గడవడమే కష్టమై పోయింది.

o o o

"సత్తక్కా....ఓయ్ సత్తక్కా....!" కుర్లేని సైకిల్లా తోసుకొచ్చాడు కార్మిక నాయకుడు నారాయణ.

"ఆగాగు........కందిచేన్ల మన్సోతు పడ్డట్టు ఎందుకంత జ్డ ?" మొహం చిట్లించింది సత్యలక్షి .

"అదిగాదక్కా...." రెండు చేతుల్తో దోమల్ని తోలాడు.

"ముందుగాల గిదిజెప్పరా...." నారాయణ నోటికి తాళం సింది. "మా లోల్ల హర్తాల్ ఎప్పుడు బంద్జై తదీ? కూలి లేక , నూ, జొర మొచ్చి రంగడూ గొడగొడ ఏడుస్తున్నాం. తిండికిలేక చస్తున్నంరా! ఇప్పుడేం జెయ్యాలె నారాయణా?" భయం, ఆవేదనలు పరుగులుకీస్తునై గొంతులో.

ఇవేవీ పట్టించుకు స్థితిలోలేడు నారాయణ.

"అవన్నీ ఎలక్షన్లయిపోయినంక....ఇయ్యాల్ల మా చెట్టుగుర్తు పార్టీ సభవెడ్తున్నమప్పటికి. నువ్వూ, రంగడూ, ముసల్ది .... అందరూ రాం డి ఆ....మరి ఎల్లుండి చెట్టుగుర్తు ఓటు గుద్దాలె....ఏ..... ం బోతున్నా." గుక్క తిప్పుకోకుండా చెప్పి పోబోయాడు. అతని భుజంపట్టి ఆపి—

"పోయినసారి నువ్వే గుట్ట గుర్తుమీద గుద్దుమన్నవు గదరా!" నోరెల్లవెట్టింది.

"నీ యవ్వ....గదంతా రాజ యమే. నీకు సమజుగాదు. అవన్నీ నీకెందుకూ....నేం జెప్పిందానికి గుద్దెయ్...."

"రంగడికి శానా జొరమొచ్చిందిరా! కలువరిత్తున్నడు. కాళ్ళూ, చేతులు కొట్టుకుంటున్నడు. నా కాళ్ళు వొయ్యి కడుపుల జొచ్చినై. వాడు లేస్త. లేడురా. ఓ పది రూపాయిలియ్యిరా, మా హర్రాలైపోంగనే ఇస్తా.." ఆశలన్నీ కళ్ళలో నింపుకుని చెయ్యి చాచింది.

"పైసలా?....మా దర్లింకా ఇయ్యలే . ఇయ్యంగ ఇస్తనక్కా! నీతోడు....ఆ(...." బయటెవ్వరో పిలుస్తున్నట్టు పరుగెత్తాడు.

రాత్రి పది దాటింది. తెల్లవారి ఓటింగ్. రంగడికి స్పృహ రాలేదు. ఏదేదో పలవరిస్తున్నాడు.

''ఇంగో సత్తక్కా....ముప్పై రూపాయలు. మీ ఇంట్లో మూడో ట్లున్నై గదా! ఆ మూడూ చెట్టు గుర్తుకే పడాలె....తెల్సిందా?....''

సుడిగాలిలా దూసుకొచ్చి మూడు పదిరూపాయల నోట్లు సత్య లక్ష్మి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు నారాయణ. గుండె అరల్లో పేరుకుపోతున్న భయాన్ని విధిలేక అణగదొక్కుకుని అతడు వెళ్ళినవైపే చూచింది.

''అమ్మో....హయ్యో....అ....మ్మా....'' రంగడు.

సత్యలక్ష్మిలో ఆశ తళుక్కుమంది. కొడుకు ఒళ్ళు తడిమింది. భయమేసింది. పొత్తికడుపులోంచి లావాలాంటి దో పొంగుకొస్తుంది.

"సత్తక్కా....ఓయ్ సత్తక్కా!'' గుడిసె తలుపు తోసుకొచ్చాడు రాజారాం.

"సత్తక్కా! మీ ఇంట్ల మూడోట్లున్నై గదా! చెట్టు గుర్తోడు ఓటుకు పదిచ్చిండు గదా! మేమిరవై ఇస్తున్నం. ఇస్కో అరవై.... ఓట్లు మా తం గుట్ట గుర్తుకే గుద్దాలె-ఆఁ.... ఇమాన్ స్తే పాపం మీ ...." మూడు ఇరవై రూపాయల నోట్లు ఎడమ చేతులుంచి జవాబు కెదిరి చూడకుండా వెళ్ళిపోయాడు.

రెండు చేతుల్లోని నోట్లు కలిపి లెక్కసింది. తొంభై.

అహా! తొంబయున్నై. తెల్లారంగనే రంగణ్ని పెద్ద డాక్టరుకు జూపించాలె. బియ్యం వాలె. మూన్నాల్గు రోజులల్ల రంగడు లేస్తడు. కూలికి వోతడు. మా హర్తాల్ గూడా బంద్ గావొచ్చు.... కారు చీకట్లో మిణుగురు పురుగులా ఆశలు రెక్కలు విప్పుకున్నై.

'అ.... బ్బో....! అ.... మో ! హా.... మ్మా!" రంగడి నోరు తెరుచుకుంది.

"రంగా....!" నోట్లను చూపిస్తూ "తెల్లారంగ పెద్ద డాక్టరుకు జూపిస్తా. బియ్యం గూడా దెస్తా. ఇగోరా పైసలూ.... ఇగో.... మన రాజారామూ, నారాయణ ఇద్దరిచ్చిండు. అయ్.... రేపు దవాఖాన నుంచి రాంగా నువ్వు గూడా వోటెయ్యాలె...."

రంగడి నోరు మూసుకోలేదు. ఒళ్ళు తడిమింది గాబరాగా. మంచు ముద్దలాగుంది. గుండెల్లో గుండుసూదులు గుచ్చుకునై. నోట్లు పక్కన బడేసి "రంగా.... రంగా...." అని చెవిలో అరిచింది.

జవాబు లేదు. కదలిక అసలే లేదు. గుండె గంగా కొట్టు కుంటుంది.

మరోసారి పిలిచింది. లాభంలేదు. మారని మురికిలోకం పోకడ కాశ్చర్యపోతున్నట్టు తెరుచుకున్న రంగని కళ్ళూ, నోరూ అలాగే ఉండి పోయినై.

"రంగా.... రంగా.... కొడుకా....!"

సత్యలక్ష్మి లో గర్భకోశం చించుకుని వెలువడిందాపిలుపు. రంగని శవమీ ద వాలి గుండెలు బాదుకుంటుంది. పెడబొబ్బలు పెడుతుంది. ముక్కులు చీదుకుంటూ బస్తీ జనాలొక్కరొక్కరే వస్తున్నారు.

చుట్టూ చేరిన ఆడవాళ్ళు రాగాలు దీస్తున్నారు. మగవాళ్ళు మాకిది అలవాటేనన్నట్టు ముడుచుక్కూచున్నారు.

రాజారాం పరుగెత్తుకొచ్చాడు.

అరె ....వీడు సావ సచ్చిండా! మరి....వీళ్ళంతా పీనుగు దగ్గ రుంటే తెల్లరంగ- ఓట్లెవలెయ్యాలె?....గుండె లబలబలాడింది.

"పాపం....సత్తెక్క ఒక్క ఉంది. మనమంతా మనిషో చెయ్యేసి తెల్లారకముం పీన్గును లావద్దాం!" అన్నాడు జాలిగా అందరివైపు చూస్తూ.

"ఏమి....పాపం! గట్లనే రాసుంటది. రంగడు మంచోడుండె. మనిషో చెయ్యేస్తాం........పుణ్యమే...." నారాయణ ముందుకొచ్చాడు. ఇదివరకే ముందు శ్రీనివాస మేర్పరుచుకున్న పందులు నిదాభంగమైనందుకు కెక్ కే....గుర్ గుర్రుమంటూ తోకలు ఝాడిస్తున్నై.

(ఆదివారం, ఆంధ్ర పత్రిక 9- -95)

# కొడుకు రాకపాయె

అసలైన ధర్మప్రచారంలో ఎదురులేని ఆదిశంకరాచార్యలా - నిర లాకాశంలో చంద్రుడు పయనిస్తున్నాడు. పిండారబోసినట్టున్న వెన్నెలలో చిన్నపిల్లలు రాజు రాజు గుమ డీ పండాట ఆడుకుంటున్నారు. అరుగుల మీద ఆడవాళ్ళ ముచ్చట్లు యధావిధిగా కొనసాగుతున్నాయి.

తన ఇంటి అరుగుమీదో పక్కన కాళ్ళకు చేతులు చుట్టి, గవద మోకాళ్ళకానించి గం రమూర్తిలా కూర్చున్నాడు ముత్యాలు. దృష్టి కుమ్మరి సారె మీదుంది. దివ్యదృష్టి మరెక్కడో ఉంది. ఆడవాళ్ళ ముచ్చట్లు అతన్ని చేరడం లేదు.

"పొద్దుట్నుంచి కుండల్జేసి అలసిపోయినట్టున్నాడు ముత్యాలన్న" అన్నది చిల్లరకొట్టు సీతమ్మ - ముత్యాలువైపు చూపులు మరలించి.

ప్రజాకోర్టులో భూస్వామి పాపారావు హత్య, మాజీ గ్రామాధికారి ఎడమకాలు, కుడిచెయ్యి గొడ్డళ్ళ దాడికి గురికావడం గుసగుసలుగా ప్రారంభమైనాయి. ఆడవాళ్ళ చర్చనీయాంశం మారిందనడానికి నిద ర్శనం సీతమ్మ మాటలే.

"ఔను వదినా! పొద్దు పొడవకముం మన్నుదెచ్చి నాన్చుకుంటడు. పొద్దుగూ దాకా కుండల్జేస్తడు. కాయకష్టం స్కు. మా మొగోళ్ళకు గిప్పుడే జెరంత పుర్సతు దొరుకుద్ది" అంది ముత్యాలు భార్య రాజవ్వ. ఆమె గొంతులో ముందటి ఉత్సాహం లేదు. మాటల్లోని చలా తనం మాయమైంది.

"మీ మొగోళ్ళకేం మహారాజులు; కూచున్నచోట సంపాదించు కుంటరు" అనలేక పైమాటలన్నది.

"కష్టం జెయ్యంది కడుపులకు రాదు రాజవ్వొదినా! నా మొగుడు కష్టపడి పట్నంనుంచి సామాన్లు దేకపో దుకానం నడువది గదా!" సీతమ్మ గొంతు స్థాయి పెరిగింది.

"ఎంతైనా కష్టంల కష్టం రుంటది. దుకాండ్ల సామాన్లమోస్తూ, రెక్కలు ఇరిగేటట్టు కాయకష్టం జేసుడూ ఒకటే ఐతదా?" కమ్మరి బలరాం భార్య లచ్చుమమ్మ రాజవ్వ పార్టీలో చేరిపోయింది, ముంగురులు సవరించుకుంటూ.

"పైసలు పెట్టుబడి పెట్టి భయపడుకుంట పంజెయ్యాలె. అందులో లాభమొస్తుందో నష్టమొస్తుందో తెల్వదాయె. నష్టమొస్తె దొంతిల నుండి అపగకుంట తప్పుచేసినట్టైపాయె. చిప్ప చేతికొస్తుంది - తెల్సా?" టీచర్ భార్య విశాలాక్షి సమర్థించింది సీతమ్మను. వెన్నెల వెలుగు ఆనిడ రవ్వల ముక్కుపుడకను తళుక్కుమనిపించి, నుదుటి బొట్టులో చెమక్కు కలిపింది.

"అందరికంటే సర్కార్ నౌకరోళ్ళ నయం. ఏ కష్టం లేకున్నా నెలనెలా రూపాయలు లెక్కపెట్టుకోవచ్చు." వ్యవసాయ కూలి దుర్గమ్మ నిట్టూర్చింది.

విశాలాక్షి మూతి మూడువంకర్లు తిరిగింది.

"సర్కార్ నౌకరేం బాగుండదు. రోజంతా పంజెయ్యాలె. ఏదన్నా ఆక్సిడెంట్ పడుంటే సెలవు పెట్టాలె. సెలవు దొరికితే సరేసరి, లేకపోతే సచ్చినట్టు డ్యూటీజెయ్యాలె. వానిక బతుకు గదా! కాయకష్టం సుక్కాని బతికించే నయం." తన వాదన సరైనదే నన్నది-ఆవిడ ఆరాటం.

"ఏదోలే భగవంతుడు ప్రాణుల నెట్ల బతికియ్యాలెనో గట్లే బతికి సడు'' అంటూ దుర్గమ లేచింది - ఈరోజు కిక చాలిద్దామన్నట్టు. ముచ్చట్ల పర్వంలో గంట గడిచిందప్పటికే.

"మన సీతారాముల పల్లెనే కాదు, దునియా అంతా గం ."సీతమ గూడా లేచింది.

ముత్యాలు చూపులు సారె మీద ఉన్నాయి.

మట్టిని నమ్మిన తనకు ఈ సారె,చ కమే అన్నం బెడుతున్నాయి. పౌడి మట్టిలో నీళ్ళు గలిపి పిసకాలి, తొక్కాలి, గిలిగింతలు పెట్టాలి. తన చెమట బిందువులు రుచి చూడగా పులకించిన మట్టి ముద్దలను సారె కెక్కించాలి. ఎలా మలిసే అలా ఆకారాలు రూపొందుతాయి. తన తండ్రి, తాతలు నమ్ముకున్నది గూడా దీన్నె.

మట్టిని నమి న మనిషి ధనవంతుడు కాకపోవచ్చు కాని దరి దు డెన్నడూ కాడు.

మరి తన కష్టాల్లో పాలుపంచుకు వాడెవ్వడు? ఇంకెవడూ? తన కొడుకే.

ముత్యాలు కసలు పిల్లలే పుట్టరన్నారు. రాజవ్వ మొక్కని వత లేదు, చేయని వతం లేదు. ఆశలన్నీ చల్లారాక ఓ రోజు కొమురెల్లి మల్లన్న గుట్ట కెళ్ళొచ్చారు. పది నెలల్లో పండంటి కొడుకు పుట్టాడు. అంతరంగం సంతోష సముద్రమైంది. ముత్యాలు, రాజవ్వ మురిపాల కంతులేదు. ఆ వుని పేరే పెట్టారు కొమురయ్య అని. సారె మీది చ కంలా కాలం గి రున తిరిగింది.

"పట్నంబొయ్యి కాలే ల చదువుకుంట నాయినా!" పదో తరగతి పాసయాక పట్టుబట్టాడు కొమురయ్య.

రాక్షస సంహారార్థం బాలరాముణ్ణి తన వెంట పంపమన్న విశ్వా మిత్రుని మాటలు విన్న దశరథుడై పోయాడు ముత్యాలు.

"అబ్బో....నిన్ను జూడకుం మా పాణాలుంటాయా?........" అందామనుకుని మింగేశాడు.

"ఇంగ సదువు చాలు. కుండల్జెయ్య . ర్చుకో. సదివినోళ్ళకు సర్కారు నౌకర్లే దొరుకుతలేవుగదా!"

కొమురయ్య మొహం కొర్రాయిలాగైంది.

"ఊహూ! ం జదువుత. బాగా చదువుకుంట. చదివించకుంటే చచ్చిపోతా!" మంకు పట్టుపట్టాడు.

"ఉన్నొక్క పోరడు సదూకుంటనంటే వద్దంటవెందుకయ్యా?" రాజవ్వ సపోర్టు చేసింది-విధిలేక.

"చదూకున్న తెలివి వేరే ఉంటుంది ముత్యాలూ!" టీచర్ నారా యణ సముదాయించాడు.

"కొమురయ్య చాలా చురుకైనవాడు. పదో తరగతిల ఫస్ట్క్లాసుల పాసాయె. ఇంకో రెండేండ్లు గట్లే పాసై డాక్టరు కోర్సుల సీటు దొరు కుద్ది."

సీతారాముని పల్లెలో వైద్యుడనేవాడు లేడు. ఏ రోగమొచ్చినా పట్నం పరుగెత్తాలి, లేదా ప్రాణాలు వదలాలి.

నల్లని మేఘం మధ్య తెల్లని మెరుపులా - వెంట సదరు ముత్యాలు బుర్రలో ఆశాకిరణం మెరిసింది.

రెక్కలు ముక్కలైనా సరే....అప్పులు చేసైనా సరే....కొముర య్యను చదివించాలె. నా లెక్క వాడు గూడా సగం బట్ట కట్టుకొని సచ్చేదాకా బతకొద్దు. వాడో మంచి పంజెయ్యాలె....నిర్ణయం అమలై

పోయింది. కొమురయ్య పట్నం పెళ్ళేప్పుడు కన్నకడుపుల్లో కడలి తరంగాలెగసి పడ్డాయి.

''ఏందయ్యా, ఇంకా గల్లే చూస్తున్న వూ?" ముత్యాలు ముందుకొచ్చి నిల్చుంది రాజవ్వ.

నెత్తికి రుమాలు, మోకాళ్ళవరకు ధోతి, ముడతలు పడబోతున్న శరీరం, లోతుకుపోయిన కళ్ళు, చిరిగిన బనీనులోంచి తొంగి చూస్తున్న ఛాతీ - భర్త అవతారం కొత్తగా కనబడింది.

"ప్చ....! మన కొమురయ్య ఎక్కడున్నడో.... ఏం స్తున్నడో?" గొణిగాడు ముత్యాలు.

రాజవ్వ ముఖం మసిబారిన కుండలాగైంది. విషాదరేఖలు దోబోచులాడాయా ముఖమీ ద.

''మన కొమురయ్య గదూ? పట్నం బొయ్యి రెం డ్లు దాటి పాయె!'' అంది ఆకాశం వైపు చూస్తూ.

చంద్రమామను మబ్బు కమ్మేస్తుంది - లంచగొండి నాయకుణ్ణి ధనదాహం కమ్మేసినట్టు. వెన్నెల బూడిదరంగు పూసుకుంటుంది.

''అంతకుముందు ఎండకాలంల గిట్లొచ్చి గట్లవొయ్యేండు. సదూకు పిల్లలు ఎండకాలంల రెండునెలలు ఇంటిదగ్గరుంటే మనోడు రెండురోజులు గూడ లేకపాయె!" ఇంట్లోకెళ్తున్న ముత్యాలు గుండె గుబగుబలాడింది.

నిజమే....ఏమైందో?!

''సదూకు టోళ్ళకు ఎండకాలమంతా తా ు (సెలవులే) గదరా? గిప్పుడే ఎందుకు వోతున్నవ్?'' అడిగింది రాజవ్వ - కొమురయ్య తిరిగి పట్నం వెళ్ళేందుకు తయారౌతుంటే.

"ఎండకాలం సెలవులల్ల బాగా సదూకోవాల్నే! గట్లైతే డాక్టర్ కోర్సుల సీటు దొరుకుద్ది." కొమురయ్య సమాధానం కొండంత తృప్తి నిచ్చిందప్పుడు.

ఇప్పుడదే తల్లిహృదయం గిలగిల్లాడిపోతుంది. చెదరిన గుండెల్ని చేతబట్టుకుని కొడుకుకోసం కళ్ళల్లో వత్తులేసుకుని ఎదిరి చూస్తున్నారు. రోజూ కొడుకు గురించే ముచ్చటించుకుంటారు. ఒకరి కంటినీరు ఒకరు తుడుచుకుంటూ ఓదార్చుకుంటారు. కొమురయ్య గురించి ఎవ్వరినడిగినా తె దంటున్నారు.

....మల్లా ఎండకాలమొచ్చె. పట్నంల సదూకు పిల్లలొచ్చిరి, శానా రోజులుండిరి. వానకాలం రాంగ పోయిరి. కొమురయ్య రాకనేపాయె.... మెతుకు నోట్లో కెళ్ళలేదు ముత్యాలుకు. అన్నం పళ్ళెం పక్కకు జరిపి పక్కకు పడుకున్నాడు.

....తెల్లవారితే రా ల పున్నమి. పోయిన రా ల పున్నమికి గూడా రా దు కొమురయ్య. ఇప్పుడెక్కడున్నడో? మా ఇంటాయనకేమో పట్నం సంగతులేమీ తెల్వయాయె. ఏం జెయ్యాలె దేముడా! నువ్వే దిక్కు.... రాజవ్వ గూడా వెళ్ళి పడుకుంది - గిన్నెలు సర్దేసి. కడుపులో పేగులు కలకలమన్నాయి.

ఎంత ప్రయత్నించినా ని ద రాలేదు. మనసంతా కొడుకు మీదనే. తెల్లవా ముందు కలత నిద్ర. కలతనిద్రలో వెలవెలబోతున్న కొము రయ్య రూపం కనిపించింది.

"మూ ండ్ల నుండి కాలం గాకపాయె. బాయిల్లల నీళ్ళెండుక పాయె. నీళ్ళెక్కడ్నుంచి దెస్తున్నావ్ ముత్యాలూ?"

మట్టి తడుపుతున్న ముత్యాలు నడిగాడు ఇంటిముందున్న కమ రి బలరాం. గానుగలో మొద్దులా నోట్లో పప్పుల్లాడుతుంది.

"రావయ్యా పంతులూ,రా! కూకో. ఇయ్యాల బడిలేదుగదా,కూకో!" ముత్యాలు పురమాయించాడు. అతని కాళ్ళ కదలిక భరతనాట్యంలా కన్పించింది నారాయణకు.

తూర్పు తలుపులు తెరుచుకుని నింగి వాకిట్లో అడుగిడిన బాల భాస్కరుని లేత కిరణాలు ముత్యాలు ఒంటిమీది చెమటబిందువుల్ని ముత్యాలుగా మార్చేస్తున్నాయి.

ఊళ్ళల్లో మీటింగులు పెట్టవద్ద పో సుల చాటింపు బు రల్లో మెదిలింది. ముఖాలు ముడుచుకుపోతున్నాయి.

ఊరంతా భయం గుప్పిట్లో ఉందప్పటి .

"గీ పేపర్ జూడుం డి" అంటూ డి గీ విద్యార్థి నాగేందర్ - కుబుసం విడిచిన పాములా పరుగెత్తుకొచ్చాడు. వార్తాప తిక విప్పి చూపించాడు నారాయణకు.

"అరె.... గీ ఫోటోనా!?...." నారాయణ ముఖం పంచరంగుల బొమ్మైంది. అతనిలో ఆశ్చర్యం, ఆందోళన. పత్రికను కళ్ళతో చదివి మడిచి బలరాం చేతికిచ్చాడు. అర్జెంటు ప ేదో గుర్తుకొచ్చినట్లు గబగబా వెళ్ళిపోయాడు.

బలరాం కంటబడింది ఫోటో.

"అరె.... ఈ ఫోటోనా?!.... గిది.... మరి తుల గదేందీ?.... ఫోటువ పేపర్లెందుకొచ్చింది?"ఆనందాశ్చర్యాలతో అతని మొహం వెలిగి పోయింది. మాటలు మాత్రం తడబడుతున్నాయి.

వెంకటేశం చేతిలో కొచ్చింది పత్రిక. తనలో తాను చదువుకుని, "అబ్బో....ఈ ఫోటో.... ఓహో....వారెవ్వా!" వెంకటేశం కనుబొమ లు ఎగిరెగిరిపడినై .

"నువ్వు కూడా చూడు ముత్యాలూ!" అన్నాడు కళ్ళు పైకెత్తి.

కాళ్ళూ తులూ కడుక్కొచ్చి పత్రికనందుకున్నాడు ముత్యాలు.

''అరె.... గీ ఫోటువ మా కొమురయ్యదే!" అరిచాడు. అతని ముఖం అధికార పార్టీ అధ్యక్షునిలా వెలిగిందో క్షణం. "కాని.... కాని చేతుల గదెందుకుంది? దీంట్లో ఏం రాశింర్రు నాగేందరూ?''

అరుపు విని రాజవ్వ ఇంట్లోంచి బయటికొచ్చింది - చేతులు కొంగుకు తుడుకుంటూ.

"చూడే....మన కొమరయ్య ఫోటువ పేపర్లొచ్చింది!" చూపించాడు.

రాజవ్వ కళ్ళు మెరిసాయి. మొహమ్మీద పదహారు రంగులు పరుగులు శాయి. "దీంట్ల ఏం రాసుంది నాగేందరూ?" కళ్ళు ప్రశ్నార్థకాలైనాయి.

నాగేందర్ తు రుమన్నాడు.

"అరె గట్ల ఉరుకుడెందుకూ? నువ్వన్నా జెప్పు ఎంకటేశమన్నా!"

"అబ్బో.... గా సంగతి నాకెందుకూ?" చెంబు అందుకుని ఎవరో తరిమినట్టు - వెళ్ళిపోయాడు వెంకటేశు.

"నీ కేమన్నా దెల్వా బలరాం?" అడిగాడు ముత్యాలు - పత్రికను మరోసారి చూస్తూ.

"జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలినట్టు నీ వోలె నేను కూడా ఏలి ముద్రగాణ్ణైతి." నోరెల్లబెట్టాడు బలరాం. అతని మెదడులో నరాలు వణికిపోతున్నాయెందుకో. నాలుక తడారిపోతోంది.

"పోవాలె. ఇవ్వాల పండుగ గదా?.... జంజె మేసుకోవాలె-పోతా." తప్పుకున్నాడు.

ఎన్నికల్లో తప్పకుండా గెలుస్తాననుకున్న అభ్యర్థి చిత్తుగా ఓడిపోయినట్టు బలరాం ముఖం వివర్ణమైంది.

చెట్ల కొమ్మల సందుల్లోంచి దూసుకొచ్చిన సూర్యకిరణాలు ముత్యాలు - రాజవ్వల మీద తచ్చాడుతున్నాయి, కళ్లముందు మసక తెరలు దింపుతున్నాయి. గుండెల్లో బండలు బద్దలైపోతున్నాయి.

ఒకరికొకరు ఆసరాగా ఇంట్లోకి నడిచారు.

"మనోడు ఎక్కడున్నడో గదా! వాని గతి ఎంత కున్నదో ఏమో! మనమేమో, పల్లెకొంపలపుట్టి పల్లెకొంపలల్లనే పెరిగి, సదువంటే భయపడ్తమి. ఏం చేస్తామయ్యా వుడా!"రాజవ్వనాభినుండి బయలు రిన ఆవేదన మూల్గు రూపంలో బయటపడుతుంది. గోడకు చేతులానించి మెల్లగా కూచుంది నేలమీద.

"ఉన్నొక్క మెతుకు గంజిలవోయినట్టు పుట్టక పుట్టక పుట్టిన కొడుకు మనకు కాకుండైపోయిం మో! ఇంగ మనకు దక్కడేమో!" అనాలనుకున్నాడు ముత్యాలు. కాని, భార్య గుండె ముక్కలై పోతుందనే భయం - ఉప్పెనలా పొంగుకొచ్చే దుఃఖానికి అడ్డుకట్ట వేసింది. అలా అననీయలేదు.

కాని, ఆమెకు ధైర్యం చెప్పాల్సిన బాధ్యత తనకుంది. తాను నోరు తెరిస్తే ఆమె శేక పెడ్తుంది.

"ఏమైతదీ? ఏంగాదు. ఇయ్యాల్లగాకపో రేపు వా వస్తాడు!" మానవా ఎతమైన శక్తి ఏదో గొంతు నులుముతూంటే ముత్యాలు నాలుక తడబడింది. నెత్తికి చేతులు బెట్టుక్కూచున్నాడు గోడకొరిగి.

"ఇం మొస్తదయ్యా? జెష్టక్క వాని నెత్తిమీది కొచ్చిం మో! తప్పుతోవల నడిపించిందేమో! మనోడు ఇంగ మనదగ్గరికి రాడు. కుక్క చావు చస్తదయ్యా!" అనాలన్పించింది రాజవ్వకు, భోరున ఏడ్వాలనిపించింది. కాని, ముత్తయ్య జారైపోతాడు. తట్టుకోలేడు. కొమురయ్య చచ్చిపోతే తన భర్త బతకడం కల్ల. గుండె ఘోషను కడుపులో అదిమి పెట్టింది.

"మరి మనోని జాడ ఎట్ల దెల్వాలె? కాని, వాడెక్కడున్నా మనింటికే వస్తడు. నా తండ్రి నా కోసం తప్పక వస్తడు." ఏదో ఆవేశం పలికించింది.

"ఇంకేమొస్తడు....రాడు....వాడు రాడు!"గావుకేక వెయ్యాలనిపించింతదనికి.

జీవన సర్వస్వమైన కొడుకు....అల్లారుముద్దుగా పెంచినకొడుకు.... రెక్కలుముక్కలు సుకుని చదివించిన కొడుకు రాబందుల చేతుల్లో చిక్కినాడేమో!.... అసలు లోకంలో ఉన్నాడో లేడో....

తల్లిమనసు తపించిపోతుంది

తండ్రి నరాలు తల్లడిల్లిపోతున్నాయి. హెద్దుగడుస్తూ సుంది.

పేగులు పిండిన కన్నీరు ఒకరిదొకరికి కనబడకుండా-భూమాతకు నుదురు లానించి - దాచుకుంటున్నారు. వెక్కివెక్కి ఏడుస్తున్నారు.

గంటసేపు గడిచిందలాగే.

సముద్రపు నీరు తనలోకిరాగా తట్టుకోలేక కట్టలు తెంచుకున్న నదిలా - మాతృహృదయ కవాటాలు ఫటేల్‌మన్నాయి.

"కొడుకా....కొమురయ్యా!" పొత్తి కడుపులోంచి దూసుకొచ్చిన పిలుపు దిక్కుల నవరించింది. ఊరంతా మార్మోగింది. రాజవ్వ భూమ్మీద కొరిగిపోయింది.

గాలి స్థంబించి పోయింది. ఇరుగు పొరుగు ఆదరవాదరాగా పరుగెత్తుకొస్తున్నారటువైపు.

"ముత్యాలూ! రాజవ్వా!!" మంటల్లో చిక్కుకున్న మనిషిలా పరుగెత్తుకొచ్చాడు వెంకటేశం.

ముత్యాలు కళ్ళు దీనంగా చూచాయి.

"మీ కొడుకు....కొమురయ్యా...." దమ్ము దీస్తున్నాడు వెంకటేశం.

గబుక్కున లేచికూచుంది రాజవ్వ.

"ఏమైంది...నా కొడుక్కేమైంది?" అడగాలనుకున్న ముత్యాలు నోరు తెరుచుకోకముందే—

"వస్తున్నాడు...బస్సుదిగి వస్తున్నాడు!" చెప్పేశాడు వెంకటేశం- రొప్పుతూ.

"అమ్మా ....నాయినా....!" వచ్చేశాడు కొమురయ్య. అతని ముఖం నిండా చిరునవ్వు పులుముకుంది. పెదాలమీది నవ్వు ముత్యాల జల్లులా కన్పించింది తల్లిదం డులకు.

శివుని జటాజూటంలోంచి వెలువడిన గంగా ప్రవాహంలా వారిలో జీవశక్తి పరుగులు తీసింది.

ఎర్రగా, బొద్దుగా.... నూనూగు మీసాలు.... నును రిన కండ రాలు .... చంద్రకాంత మణుల్లా మెరిసే కళ్ళు .... తెల్లని డెస్సులో కొమురయ్య.

"కొమురా! వచ్చినావా?" దిగ్గున లేచి గుండెలకు హత్తుకుంది రాజవ్వ. వర్షాకాలం, ఆకుల కొనలనుండి రాలిపడుతున్న జలకణాల్లా ఆమె కళ్ళనుండి నీటి బిందువులు బొటబొటా రాలిపడ్డాయి.

తండ్రి పాదాలకు నమస్కరించాడు కొమురయ్య. కొడుకున్ను వాత్సల్య కౌగిలిలో బంధించింది పితృహృదయం.

"బాగున్నావా కొడుకా?".... ఇంకేం మాట్లాడాలో అర్థం కాలేదు

ఏ తొవ్వదొక్కిండు? ఏమైపోతడు? ఏం జేస్తున్నాడు? ఎందు కొచ్చిందో...ఎంత సేపుంటడో....పత్రిక ఫోటో కలవరపెట్టింది.

గూట్లోంచి పత్రిక తీసి కొమురయ్యకు చూపించి—

"పేపట్ల నీ ఫోటువ ఎందుకొచ్చిందిరా?" ఆపుకోలేక అడిగేశాడు.

కొమురయ్య ఏం చెబుతాడోనని రాజవ్వ ఊపిరి బిగపట్టింది.

"నేను విమాన సైనిక దళంల చేరిపోయిన నాయినా!" నవ్వు ముఖంతో హుషారుగా చెబుతున్నాడు కొమరయ్య "హైదరాబాదు దిండిగల్లులనే ట్రైనింగైంది. ను అందులో ఫస్టుగపాసైన. అందుకే నా ఫోటో పత్రికల వచ్చింది."

మురిసిపోతున్న కొమురయ్య మాటలు తల్లిదండ్రుల్లో మసిలిన అనుమానాలను పారదోలలేదు. సందిగ్ధంగా వెంకటేశం వైపు చూచారు.

"కొమురయ్యకు గాలిమోటర్ల మిట్రిల నౌకరి దొరికింది. తుపాకి పట్టుకుని ట్రైనింగ్ సెటప్పటి ఫోటో పేపరుకిచ్చిండ్రంట." వివరించాడు వెంకటేశం.

"మీ కొడుకదృష్టవంతుడు పెద్దయ్యా!" నారాయణ అమితోత్సాహంతో కొమురయ్య భుజమ్మీద చెయ్యేశాడు. "నేను గూడా మీ కొమురయ్యతోని ఇంటర్వ్యూకు పోయిన. కాని, సెలెక్టు కాలేదు."

"మరి గా సంగతి మాకెందుకు జెప్పలేదు బిడ్డా?" అడిగింది రాజవ్వ.

"మీరు పరేశానైతరని కొమురయ్యనే చెప్పవద్దన్నడు. ఈ సంగతి మీకు చెప్పొద్దని వెంకటేశమన్నకు నేనే చెప్పిన."

"నాక్గూడా వాడే చెప్పిండు." నారాయణ.

"ఎందుకట్లా?" ముత్యాలు కా-శమొచ్చింది.

"ఎట్లాంటే.... గ ....మీకు చెప్తె మీ కొడు మైపోతడోనని గుండె పగిలి చస్తరని చెప్పలేదు." అసలు సంగతి కొమురయ్య చెప్పేశాడు.

'దానికి నన్ను క్షమించరూ!' అన్నట్టు వుందతనివాలకం.

రాజవ్వ, ముత్యాలు ముఖాలు మతాబాల్లా వెలిగాయి. హిందూసామ్రాజ్య పట్టాభిషిక్తుడౌతున్న వీరశివాజీని చూస్తున్న జిజియామాతైంది రాజవ్వ.

(జాగృతి 27-6-94 & 0-7-94)

# యమతీర్పు

ఆరోగ్యశాఖామంత్రి అన్నారావుకు ఆక్సిడెంటైంది.

పట్టపగలు నట్టనడిరోడ్డుమీద ఘోర పమాదమైంది. వెంటనే పమాద స్థలం పోలేరమ్మ జాతరలాగైంది.

"రోడ్డు పమాదాలు - నివారణోపాయాలు" అంశంపై జాతీయ స్థాయిలో జరుగుతున్న సదస్సును పారంభించి, పధానోపన్యాసాన్ని గూడా పెటపెటబెట్టి మంత్రివర్గ సమావేశానికి పరుగులు దీస్తున్న మంత్రి మాపటికారు ముక్కలు - మానవ శిరచ్ఛేదాన్ని ప్రత్యక్షంగా చూచిన మనిషి మెదడు సరాల్లా ఫెయిలైపోయినై.

బిజీ చౌరస్తాలో రెడ్ సిగ్నల్‌ను గౌరవించి నుంచున్న మిలిటరీ జీపును మంత్రి కారు గుద్దేసింది. అందాల కారు అర నిమిషంలో ఆరు చెక్కలైంది. డ్రైవరు కాలు ముక్కలైంది. మంత్రి గుండెకు బలమైన దెబ్బతగిలింది. అక్కడికక్కడే స్పృహ కోల్పోయాడు. అఘమేఘాలమీద అంబులెన్సు వచ్చేసి హాస్పిటల్‌కు మోసుకెళ్ళింది.

దావానంలా వ్యాపించిన వార్త సిటీని కుదిపేసింది. మంత్రులు, అభిమానులు, ఉద్యోగులతో ఆస్పత్రి అంగడి బజారైంది. అదనపు సెక్యూరిటీ బలాలు రంగంలోకి దిగాయి. పెద్ద పెద్ద డాక్టర్లు మంత్రి చుట్టూ కుక్కపిల్లల్లా మూగారు.

అరగంటకు గడిచింది. మంత్రి కొద్దిగా కదిలాడు. డాక్టర్ల కళ్ళు జిగేల్‌మన్నై.

మెల్లగా కళ్ళు విప్పిన అన్నారావు దృష్టి కిటికీలు దాటి గేటువైపు మళ్ళింది.

ఇద్దరు జమాజెట్టీలు....తుమ్మ మొద్దులకు నల్లని ఆయిల్ పెయింట్ వేసినట్టున్న దృఢకాయులు కన్పించారు. అన్నారావులో చైతన్యం పెంగలించింది. లేచి కూచున్నాడు.

పగలు కన్పిస్తే రాత్రి కలలో కొచ్చేట్టున్నారీ రౌడీ వెధవలు. వీళ్ళు నా గాంగు వాళ్ళలా లేరే....ఈ అవతారాలను నెప్పుడూ చూడ్లేదే.... ఎవరి తాలూకో .... అనుకునేలోగా వాళ్ళిద్దరూ వచ్చేసి అతని ముందే నుంచున్నారు.

"ఎటొచ్చారోయ్?...." అడిగాడు హుషారుగా.

"ఇటే...." పిడికెడు మీసాలను చిటికెన వేలుతో సవరించుకున్నాడొకడు.

"ఎవరి కొరకు?"

"నీ కొరకే...." మరొకని మీసాలు విచ్చుకున్నాయి.

ఏదో పైరవి కొచ్చుంటారు వెధవలు. ఎంత రౌడీలైతేమాత్రం సమయ సందర్భాలుండొద్దా....లోకజ్ఞానం పూజ్యమే పహిల్వాన్లకు.

"ఏం కావాలోయ్?"

"నువ్వే కావాలోయ్!" కోరస్.

హమ్మ నాకొడకల్లారా! ఎవర్నో తెలుసుకు మాట్లాడ్తున్నారా? ఇంత గట్టి సెక్యూరిటీని ఛేదించుకుని ఎలా రాగలిగారో....అన్నారావులో అసహనం కోడెనాగులా పడగవిప్పి-కుంటిగుఱ్ఱంలా నిలబడిపోయింది.

"నాతో మీకేం పనిరా?"

"నీతో పనిరా!"

అయ్యో .... నా పరువు పాతాళ గంగ పాలైపోతుంది. లేచి నుంచున్నాడు.

"అచ్చం యమదూతల్లాగున్నారు, ఎవ రా మీరు?"

"యమదూతల్లా కాదు, యమదూతలమేరా!"

"నీ లోకంలో నూకలు చెల్లిపోయినై నీ ప్రాణాలు సుకెళ్లేందు కొచ్చాంరా!"

సత్యసాయిబాబాలా గాల్లో చేతులూపారిద్దరూ.పొడగాటి రంపాలు... తళతళలా రంపాలొచ్చినై ఇద్దరి చేతుల్లోకి.

అతి గంగా పరుగెత్తుతున్న ఎలక్ట్రిక్ ట్రెయిన్‌కు సడెన్ బ్రేకులు పడ్డట్టు - అన్నారావు గుండె ఠపీన ఆగిపోయింది.

'ఐ .... నేను చచ్చిపోయానా?"

"ఔను."

"అయ్యయ్యో.... నా భార్యా.... నా పిల్లలూ.... బాంక్ ఖాతాలు.... బంగారాలు.... బినామీ ఆస్తులూ.... నా మంత్రిపదవీ.... కార్లూ.... సెక్యూరిటీ...."

"అవేవీ వెంటరావుగని పద." గుర్రుమన్నాడొకడు- రంపాన్ని గాల్లో తిప్పుతూ.

"నేన్రాను.... రానంటే రాను.... రానుగాక రాను." పీకకోసిన మేకలా అరుపులు. షి ంచాడు.

"నువ్వెంత అరిచి గీపెట్టినా అరణ్య రోదనమే. నడువోయ్ కుయ్యా...." మెడల మీద చెయ్యేసి ముందుకు తోసాడింకొకడు. బొక్క బోర్లా పడ్డాడు.

అమ్మో.... వీళ్ళకు మా పోలీసులే ట్రేనింగిచ్చుంటారు. లేచి మోచేతుల మోకాళ్ళ తడుముకుంటూ ముందుకు నడవక తప్పలేదు.

ఒక యమదూత అన్నారావు చెయ్యిబట్టుకుని లాక్కెళ్తున్నాడు. మరో యమదూత అక్కడే ఉండిపోయాడు.

"మరి.... అతడు రాడా?" అగబోయాడు అన్నారావు. కాని, ఆగ లేదు.

"నీ పార్థివ శరీరం కాలి బూడిదై పోయేదాకా అతడిక్కడే ఉంటాడు."

"అట్లెందుకూ?"

"ఎందుకంటే...." ఏదో గుర్తుకొచ్చి నాలిక్కరుచుకున్నాడు యమదూత. "అదంతా నీకెందుకూ.... నడువ్." రంపం పైకి లేచింది.

యమదూత నిప్పంగి చూపులకు అన్నారావు అదిరిపోయాడు. ఎన్నో చీత్కారాలను అవలీలగా భరించిన అన్నారావు ఆ చూపులకు తట్టుకోలేక మొహం పక్కకు త్రిప్పేశాడు.

o o o

"అన్నవరం పుణ్యక్షేత్రములో అడుక్కుతినే గుడ్డోడి డబ్బాలో పైసవేసి పావలా సుకున్నాడం. ఈ అన్నారావు...." చిట్టా తెరిచి చదివాడు చిత్రగుప్తుడు. యమధర్మరాజు తలూపాడు. వెడల్పాటి చెవుల రింగులు గమ్మత్తుగా ఊగాయి.

న్యాయశాస్త్ర పరీక్షను ఇన్‌స్టాల్ మెంటు పద్ధతిలో పాసై అడ్వొకేటు అనిపించుకున్న అన్నారావు రాజ య జీవితం అన్నవరంతోనే ప్రారంభ మైంది.

మొదటి ప్రయోగం ముష్టోడి డబ్బా మీద. .... గ్రాండ్ సక్సెస్. బోలెడంత ఆత్మవిశ్వాసంతో గుండెకాయ బండరాయైంది.

అన్నారావులోని అడ్వొకేట్ మేల్కొన్నాడు.

"యువరానర్!" ఇంకేదో అనబోయాడు.

"నోరు య్ నరాధమా!" గదమాయించాడు యమధర రాజా. కిరీటం ధగద్ధగలు గదమీద చెమక్కుమన్నాయి.

లాభం? ఆ కొబ్బరి ముక్కలోంచి చిన్నముక్క గూడా ప్రసాదంగా స్వీకరించలేదు. ఆ పాపానికది చెల్లు...."

అది నవ్వో కవ్వింపో అర్థం కాలేదు.

"గల్లీనుండి ఢిల్లీదాకా, మామూలు వార్డు మెంబరునుండి మంత్రి పదవిదాకా ఎగబాకాను. కాని, ఏం లాభం? చచ్చూరుకున్నాను. ఇక్కడ పైరవీ లేపీ నడిచేట్టులేవు' అన్నారావు అల్లాడిపోతున్నాడు.

"ఈ అన్నారావు ఆరోగ్యశాఖా మంత్రి. ఆంధ్రదేశంలోని ఆస్పత్రులన్నిటి సరఫరా చేసేందుకు విశాల నుండి అత్యాధునిక రోగనిర్ధారక కంప్యూటర్లు కొనుగోలు చేశాడు. ఆ కొనుగోలులో ఐదు వందల కోట్ల రూపాయలు స్వాహా చేశాడండి!...." మరో పద్దు చదివాడు చిత్రగుప్తుడు.

"హయ్యారే...అంత పెద్ద మొత్తాన్ని ఎలా జీర్ణించుకోగలిగాడో!?" ముక్కుమీద వేలేసుకున్నాడు యమధర రాజు.

"ఆ డబ్బంతా స్విస్‌బాంకులో దాచుకున్నాడండీ! ఆ రహస్యాన్ని బయటపెట్టిన నిజాయి పరులైన అధికారుల్ని ముప్పతిప్పలు బెట్టి ముప్పై చెరువుల నీళ్ళు దాగించి శంకరగిరిమాన్యాలు తట్టించాడం !"

"అది కూడా రాసుందా?!" నోరెళ్ళబెట్టాడు అన్నారావు. ఆ తరువాత సర్దుకుని, "మా దేశంలో వేల కోట్ల రూపాయలు గుటకాయ స్వాహా చేసిన మహానుభావులున్నారండీ! ఆ మహనీయులు మార్గమే నాకాదర్శం. వాళ్ళముందు ، నెంతం చిత్రగుప్తులవారూ? ఐనా.... ప్రజాధనాన్ని ఉడతాభక్తిగా భోంచెయ్యనివాడు ప్రజానాయకు డెట్లౌతాడండీ?" దబాయించబోయాడు.

"తప్పు తప్పు.......... ప్రజానాయకుడంటే ప్రజాసేవకుడు. సేవ అంటే భోంచెయ్యడంకాదు. ఐనా, ఎవడి పాపం వాడనుభవించక తప్పదు సరుడా! ఎవరి శిక్ష విధించాలో మాకు బాగా తెలుసు. ముందు నీ సంగతి చూస్కో....." చెప్పేశాడు యమధర్మరాజు.

'ఈయన ముందటి జన లో హూ సు పీంకోర్టు పధాన న్యాయ మూర్తయుంటాడు....' అన్నారావు అంతరంగం అల్లకల్లోలమైంది.

ఐనా....సమాధానమివ్వాలి. లేకపో ఎగ్స్పార్టీ డెసిషనై పోతుంది.

"మాననీయ యమధర రాజా! పతి ఎన్నికల ముందు ఎందరో నిరుపేదలకు డబ్బు సహాయం చేశాను. ఇలా.... పతి ఎన్నికలకో కోటి రూపాయలన్నా దానం చేసుంటాను.... దానికిది చెల్లవేయవచ్చుగదా?"

"దానం కాదది. దగా. డబ్బు పంచడం కాదది....ఓట్లు కొనుక్కోవడం. పజల్ని ప్రలోభపెట్టి పదవికి ఎన్నిక కావడం మహాపాపం. అదిగూడా ఈ చిట్టాలో పాపాల జాబితాలోకి ఎక్కింది నాయనా!''

'రాజభరణాల రద్దు సులా నా కేసిలా తిరగబడిం మిటీ?....' నిప్పులమీద నడిచి నట్టనిపిస్తుంది అన్నారావుకు.

"ఇదన్యాయం. ఒకదానికి చెప్పిన సమాధానాన్ని మరోపాపంగా చిత్రించడం అన్యాయం, అక్రమం. హే యమలోకప ! మహిషవాహనా! ధర్మరక్షకా! ఇది మీ - అనగా మన ధర సూత్రాల విరుద్ధం తం డీ!"

"ధర సూ తాలకు విరుద్ధమా....?" యమధర రాజు డైలమాలో పడిపోయాడు. విచారణకై క్యూలో నిల్చున్న పాణులూ, పాణుల్ని లాక్కొచ్చిన యమభటులూ, సభాసదులూ అసెంబ్లి గ్యాలరీ పేక్షకుల్లా ఆసక్తిగా చూస్తున్నారు.

బాక్సాఫీసు బద్దలు కొడదామని సినిమారంగంలో దిగి మొదటి బొమ్మకే దిమ్మెక్కి దివాలా సిన నిర్మాతలాగై పోయాడు చి తగుప్తుడు.

సీటులో ఉంచిన స్పాంజి కాస్సేపట్లోనే బరువెక్కినట్టు నిమిషాల్లో బలం పుంజుకుని "అయ్యా! ఈ నరుడు నరకాసురుణ్ణి మించిపోతున్నాడం ! మాటలతో మభ్యపెట్టి మిమ్మల్ని పల్టీ కొట్టించాలనుకున్నాడు." హెచ్చరించాడు.

ఉలిక్కిపడ్డాడు యమధర్మరాజు.

ఔనౌను.... నరావతారమెత్తి వచ్చిన ప్రాణులతో జాగ్రత్తగుండాలి. అలనాటి సతీ సావిత్రి, నచికేతుడు, మార్కండేయుడు గుర్తుకొచ్చారు.

"ఓయీ అన్నారావూ! మా చిత్రగుప్తుని చిట్టా అంశాలకు సమాధానం చెప్పి రాల్సిందే!" చెప్పేసి సర్దుకున్నాడు.

''నో.... ఈ రూలింగ్‌తో నే భవించను. తక్షణమే సభనుండి వాకౌట్ చేస్తా." మొత్తుకున్నాడు అన్నారావు, కాని, అది అసెంబ్లీ కాదని గుర్తుకొచ్చి హతాశుడయ్యాడు.

"నీ ఏ భావంతో మాకెలాంటి సంబంధం లేదు." మరో రూలింగ్.

"భారత దేశంనుండి వచ్చే మానవుల్ని విచారించడం కష్టమై పోయింది ప్రభూ! మాటిమాటికి ఆంగ్ల పదాలుపయోగిస్తారు. అ ఇంగ్లండ్ నుండో మరో దేశంనుండో వచ్చినవారైతే ఎంచక్కా వాళ్ళ మాతృభాషలోనే సంభాషిస్తారు, ఇతర భాషా పదాలు వాడరు."

"ఏం చేద్దాం చిత్రగుప్తా! పిల్ల పోయినా పురిటికంపు పోనట్టు - భారత దేశంనుండి ఆంగ్లేయులు వెళ్ళిపోయినా ఆ భాషా, సంస్కృతులు మాత్రం పోనంటున్నై. చదువుకున్న నరులంతా అలా మాట్లాడ్తారు, మనమే సర్దుకుపోవాలి."

యమధర్మరాజు మాటలకు అన్నారావు పొంగిపోయాడు.

చిత్రగుప్తుని చిట్టా పేజీ తిరిగింది.

"ఈ అన్నారావు షేర్ల వ్యాపారం కుంభకోణంలో కోట్ల రూపాయలు గోల్‌మాల్ చేశాడు. ఆ కుంభకోణం గురించి విచారించిన ప్రభుత్వ కమిటీ గూడా ఇతన్ని తప్పుపట్టింది. కాని, ఆ కమిటీ రిపోర్టును మసిబూసి మారేడుకాయ చేసి ప్రజలకు శఠగోపం పెట్టాడు మహా ప్రభూ!"

ఒర్నాయనో....అక్కడ తప్పుకున్నా. ఇక్కడ తప్పుకు ట్టులేదే! ఈ చిత్రగుప్తుణ్ణీ వాని చిట్టానూ మా రాయలసీమ హాండ్ బాంబ్‌తో లేపేస్తే బాగుండును....అన్నారావు పళ్ళు పటపటలాడినై. కాని ఏంలాభం? బు రలో ఓ మెరుపు....

"ఆ పాప పరిహారార్థం నా కొడుక్కి ఓ నిరుపేద పిల్లతో పెళ్ళి చేసానం ! నయాపైస కట్నంగూడా అడగలేదు."

"ఆ అమ్మాయిని మీ వాడు బలాత్కారంచేస్తూ పట్టుబడ్డాగు. కాబట్టి తప్పలేదు. దాంతో పాపపరిహారం కాదు. కట్నం ీసుకోవడం మహాపాపం. నువ్వా పాపం చెయ్యలేదంతే ఆ పెళ్ళయ్యాక నీ కొడుకునో ఆదర్శ యువనాయకుడిలా నుంచో బెట్టి ఎమ్మెల్లేగా గెల్పించుకున్నావు గదా! నీ మం తి పదవిని వాడు చేపట్టబోతున్నా డిప్పుడు."

పాతాళంలోకి కూరుకుపోతున్నట్టనిపించింది అన్నారావుకు. కోపంతోపాటు ఏడుపుగూడా ముంచుకొస్తుంది.

"ఈ చి తగుప్తులవారి చిట్టా కెమరులేదా మహా పభూ?"

సూర్యకిరణాలు సోకిన చిరుపద ంలా విచ్చుకున్నాయి యమధర రాజు పెదాలు.

"నరుడా! భూలోకంలో కంప్యూటర్లు ఇప్పుడిప్పు వస్తున్నై. కాని, వాటి గురించి వేదాల్లో చెప్పబడిన సంగతి ఎంతమందికి తెలుసు? మా చి తగుప్తుని చిట్టాను మించిన కంప్యూటర్ న భూతో న భవిష్యతి. ఈ కంప్యూటర్ ఎప్పుడూ చెడిపోదు. మరమ తులుండవు. జీవుడు చేసిన పాపపుణ్యాలన్నీ ఎప్పటికప్పుడు ఇందులో కెక్కిపోతాయి. దానికి తిరుగు లేదు...."

"మీ నిర్ణయానికి అపీలు లేనట్టే...."

"ఔను....అం ."

ఆశ్రిత పక్షపాతం, రాజ య ప్రత్యర్థుల దారుణ హత్యలు, స్థానిక దేవాలయాలకు విరాళాలు.... అన్నారావు పాపపుణ్యాల గురించి చాలాసేపు నివారణ కొనసాగింది.

"ఈ నరాధముడిని ఘోర నరకంలో పడవేయడం తప్ప ఇంకేముంది చిత్రగుప్తా?" సమాలోచనగా చిత్రగుప్తుడివైపు చూచాడు యమ ధర్మరాజు.

"చిత్తం అంతేకదా?"

" వా! మహానుభావా!! యమధర్మరాజా!" అన్నారావు ఆత్మ నిప్పులదొక్కిన కొండముచ్చైంది. "ధర్మప్రభువులు! మీరే ఇట్లంటే నాగతేంకావాలి? కనీసం మామూలు నరకానికన్నా పంపించండి ప్రభూ!" కాళ్ళమీద పడాలని ముందుకురికాడు.

దిగ్గున లేచాడు యమధర్మరాజు.... "వీడు నా కిరీటం లాక్కొని ఈ పీఠమెక్కాలని ఉరికొస్తున్నాడు. ఆపండి. వాణ్ణక్కడే ఆపండి." గట్టిగా చెప్పాడు. యమలోకం దద్దరిల్లింది.

నలుగురు యమదూతలు అన్నారావు రెక్కలు పట్టి వెనక్కి నెట్టివేశారు. నిలదొక్కుకోబోయి వెల్లకిలా పడిపోయాడు.

ఓర్ని....అసెంబ్లీ మార్షల్స్‌లా చేతులమీద ఎత్తుకెళ్తారనుకుంటే ఇలా పడేస్తారా?

"ఒరేయ్! మీరు భూలోకంలో ఎనుబోతులై పుడతార్రా...." ఉ క్రోషం పొడుచుకొచ్చింది కాని, ఏం లాభం?

మెల్లగా లేచాడు.

పాతబడిలో చేరిన కొత్త శిశుతరగతి విద్యార్థిలా చేతులు కట్టుకు నుంచున్నాడు.

''ఓయీ అన్నారావూ!" గుండెల నిండా గాలి పీల్చుకుని కూచు న్నాడు యమధర రాజు "జన ఉలో సర్వోత్కృష్టమైనది మానవజన్మ. కన్న భూమిని, ఆదరించిన సమాజాన్ని సేవించి, ఆ పుణ్యంతో మోక్షాన్ని పొం. ందుకు మానవజన్మమే చివరి అవకాశం. ఆ సంగతి మరచిన మాన వుడు తుచ్ఛమైన సంపదలు మూటగట్టుకుంటూ, పూర్వజన ల పాప భారాన్ని మరింత పెంచేసుకుంటుంటే ఘోరనరకం తప్ప ఇం ం లభి స్తుంది?...."

అన్నారావుతో పాటు మిగతా పాణులు గూడా ్ద్దగా వింటు న్నారు.

''రాజా.... యమధర రాజా!" దూరంనుండి క.

అన్నారావు పాణాల కోసం వచ్చి ఆస్ప తిలో, ఉండిపోయిన యమదూత పరుగెత్తుకొస్తున్నాడు.

''ఏమి- .... ఎందుకా పరుగులు?" చి తగుప్తుడు అయోమయంలో పడిపోయాడు.

ఆయాసంతో రొప్పుతున్న యమదూతకు నోటిమాట రాలేదు.

ఓ పార్టీలో కలిసి ఎం సి రే పార్టీలో చేరిన ఆప్తమి తుడు అమెరికాలో కన్పించినట్టనిపించింది అన్నారావుకు.

''నమస్తే మిత్రమా!" ఉల్లాసంగా అతని దగ్గరికెళ్ళాడు. కాస్సేపు పీపు నిమిరాడు.

''భటుడా! ఏమైందీ?" గం రంగా అడిగాడు యమధర రాజు.

''అయ్యా!.... ''కాస్త నెమ దించింది యమదూతకు." ఈ అన్నా రావు చనిపోగా, అతని కళ్ళను సి ఓ గుడ్డోడి కమర్చారయ్యా! ఆ గుడ్డోడికి చూపొచ్చిందయ్యా!"

''ఔను.... .ను బతికుండగా, నా కళ్ళను ఐ బాంక్‌కు రాసి చ్చాను పభూ!" గుడ్డోడికి చూపొచ్చినంత సంతోషమైంది అన్నారావుకు.

''ఐ.... అది , తదానమన్న మాట!....'' చిత్రగుప్తుడు గబ గబా చిట్టాలోకి చూచాడు. "ఔను.... అదిప్పు మన చిట్టాలో కెక్కింది ప్రభూ!"

యమధర్మరాజు మొహం ఫోన్ బల్బులా వెలిగింది. "సర్వేం ది యాణాం నయనం పధానం. ౹ త్రదానంతో పాపాలన్నీ హరించుకు పోయినై. ఈ అన్నారావును స్వర్గానికి పంపిస్తున్నాం."

యమ ర్పు వెలువడింది.

(అన్వేషణ వారపత్రిక 7 మే 995)

# ఇద్దరూ భర్తలే

పరిమళ చురుకైన చూపులు శూన్యంలోకి చొచ్చుకుపోతున్నాయ్. పచ్చి పాలలో సాయపసుపు రంగరించిన మేనిఛాయతో మిసమిస లాడుతున్న పరిమళకేమీ తోచడం లేదు. సముద్ర తీరాన కాలివేళ్ళకతుక్కున్న ఇసుక రేణువులు తమంత తాముగా రాలిపోతున్నట్లు ఒకరోజు వెనక మరోరోజు నడిచిపోతున్న నేపథ్యంలో....

"మనను విడదీసే శక్తి ఈ భూప్రపంచంలో ఏదీలేదు పరిమళా!" అంటూ ఎదలోతుల్ని చుంబించాడు రమేష్. "నా ప్రపంచంలో నువ్వు తప్ప మరెవ్వరూలేరు రమేష్!" అంది తను. తల్లినీ, తండ్రినీ పోగొట్టుకుని మేనమామ ఇంట్లో పెరిగిన తన ఎడారి బ్రతుకులో గంగాఝరిలా ప్రవేశించాడు రమేష్. అనురాగమనే అందలమెక్కించి మూడుముళ్ళ బంధం వేశాడు. దాంపత్యజీవన మాధుర్యాలను దోసిళ్ళతో తాగించిన రమేష్ ఏమయ్యాడు?

నిండు చూలాలైన తనను దుప్పటి ముసుగులోంచి విడిపోనివ్వకుండా "ఈ రోజు వైకుంఠ ఏకాదశి. రాజమండ్రి వెళ్ళి గోదావరిలో కాస్సేపు ఆడుకుని వద్దామా?" అంటూ చెక్కిళ్ళను తడిపేశాడు రమేష్.

"ఆ తల్లి ఒడిలో ఆడుకోవాలని నాకూ ఉందం! కాని....ఈ అవతారం....అబ్బే....మీరెళ్ళిరండి!" ఇష్టం లేకున్నా బాహుబంధం నుంచి విడిపించుకుంది పరిమళ.

ఈ చిలక కోసమే తల్లి తండ్రుల్ని, కోట్ల ఆస్తినీ కొనగోటితో సమానంగా వదిలేసి, వేరే కాపురం పెట్టిన ఆ గోరువంక సాయంత్రానికి గూడు చేరలేదు. రాజమండ్రి పది కిలోమీటర్లే .... గాబరా .... గందరగో

గోళం. ఎవరితో చెప్పుకోవాలి? పెద్దల మాట వినలేదని వేధిస్తున్న ఈ మానవ మృగాల కెలా చెప్పాలి? ఊహూ! చెప్పాలి. రాత్రినంతా బండరాయిలా మోసింది. మర్నాడు పక్కింటి మాస్టారికి చెప్పింది - పొంగుకొస్తున్న బాధను గొంతులో అదిమిపెట్టి.

"వస్తాడులే! రాకేం స్రాతమ్మా?" అని ఊరుకున్నాడాయన-ఇం మన్నా మాట్లాడితే ఇహలోక పాపాలన్నీ తననే చుట్టేస్తాయన్నట్టు బెదిరిపోతూ.

మూడో రోజు కూడా గడిచిపోయింది. ఇక ఆగలేని పరిమళ సింహం గుహలో కెళ్తున్న చిట్టిమేకలా రమేష్ మూడంతస్తుల రాజభవనంలో ప్రవేశించింది.

"అత్తయ్యా! మూడోజులక్రితం రాజమండ్రి వెళ్ళిన మీ అబ్బాయి ఇంకా రాలేదు....దయచేసి....'

"అయ్యో....మూడోజులైందా?"

"నా కొడుకెప్పుడో చచ్చిపోయినాడు!" మామగారి కంచుకంఠం "మా మాటవినకుండా నీవెంట పడ్డప్పుడే వాడు మాకు లేకుండాపోయాడు. చాల్లే! వెళ్ళు! పో....!"

నాల్గో రోజు ప్రాణాలరచేతిలో కొచ్చాయి. కాళ్ళు మేనమామ ఇంటికి లాక్కెళ్ళాయి.

"ప్రేమా, దోమా అని ఆ దిక్కుమాలిన వెధవతో లేచిపోయావు. మా తలలు నరికి పారేశావు గదే పాపిష్టిదానా! నా మాట నువ్వు వినలేదు. నీ మాట మేమెందుకు వినాలి?" పెంచిన ప్రేమ వేడిపెనమీదికి విసిరేసింది పరిమళని.

○ ○ ○

వారం రోజులు ఎలా గడిచాయో .... ఇద్దరు పోలీసులు ఇంట్లో కొచ్చారు. "ఈ డ్రెస్సు నీ భర్తదేనా?" అని అరా తీశారు.

"కాదు. అది రమేష్ డ్రస్సే. గోదావరి స్నానాని కెళ్ళేప్పుడు వేసుకుంచే....కాదు వారేరి?...." గుండె గుబ గుబ పరిమళకి!

"ఈ గుర్తులున్న శవం కాకినాడ పో సులకు దొరికి మా పోలీసుల కప్పగించారు. ముదిగిన శవాన్ని పంచనామా చేసి కాల్చేశారు. డ్రెస్సుమీద టైలర్ లేబుల్ ద్వారా ఈ ఊరు మనిషని తేలింది. ఆ టైలర్ సరిగాం మీ రమేష్ దన్నాడు."

"అయ్యో....నా రమేష్! భగవాన్...." పిడుగుల వర్షం కురిసింది! భూమ్మీద విష ప్రాణులన్నీ పట్టుబట్టి ఒకేసారి కాటేశాయి! నాలుగు దిక్కులు ఒక్కటై వెక్కిరిస్తూంటే స్వప్న మందిరం ఫెళ ఫెళార్భాటాలతో కూలింది! నరాల్లో ముళ్ళు ప్రవహిస్తున్నాయి!

ఏం చెయ్యాలి? ఎవరి నాశ్రయించాలి? దిక్కెవ్వరూ? అష్ట దరిద్రంలో ఆడపిల్ల పెళ్ళి కెదిగినట్టు నొప్పులొచ్చాయప్పు . చిమ్మ చీకటి చిట్టడవిలో వెలుతురు పూవులా అప్పు వచ్చాడు మేనబావ సుగుణాకర్.

"ఎంతపనైంది పరిమళా! మా అమ్మానాన్నల అమానుషం నిన్ను దిక్కులేనిదానిగా మార్చేసింది కదూ? నేనొచ్చాను. నున్నాను పరిమళా!" స్నేహస్నిగ్ధ కంఠస్వరం!

తండ్రిలేని తనయుడు భూమ్మీద కేర్ మన్నాడు.

"అనంత ప్రాణికోటిని అలరించే స్వామీ! నా లోకం వద్దు. ఇహ నేనిక్కడుండలేను. రమేష్ లేని లోకం నాకో చీకటి కొటారం. కానీ వీడు—ప్రేగు చించుకొచ్చిన పసివాడో .... తండ్రిలేని నిర్భాగ్యుడు తల్లి లేనివాడై పోడా?"

ఏమీలేని తనకు అన్నీ సమకూర్చాడు సుగుణాకర్. కొండంత అండగా నిలిచాడు. ఇలా ఇంకెన్ని రోజులాదుకుంటాడు?

"ఎందుకు బావా ఇదంతా? ఈ దౌర్భాగ్యురాలిమీద జాలి చూపిస్తున్నావు, ఈ ఋణ మెట్లా ర్చేదీ?"

"ఇది జాలి కాదు పరిమళా! నా బాధ్యత. చిన్నప్పట్నుంచీ కలిసి తిరిగాం. పెరిగాం, నన్నర్థం చేసుకున్నదిం నా? . న్నీ కేమీకానా?"

''అది కాదు బావా! నువ్వీ. శంలో లేనప్పుడు నా సుఖం . ను చూసుకున్నాను. నేను పుట్టగా. మీ, మా అమా నాన్నలు నేను నీ పెళ్ళాన్నని మురిసిపోయారుట. అమృత హృదయుడైన రమేష్ అభయ హస్తం నన్నదంతా ఆలోచించనీయలేదు బావా!'' గుండె పొంగి కళ్ళ ద్వారా పవహించింది.

"పచ్చి బాలెంతవు, ఆరోగ్యం కాపాడుకో. రమేష్ ప్రతిరూపాన్ని పెంచి పయోజకుడిగా చెయ్యడమే నీ జీవిత పరమావధిగా భావించు. జీవితం భగవంతుడిచ్చిన వరం! కష్ట సుఖాలను సమానంగా భరిస్తే భవిష్యత్తు దారినిస్తుంది." బాధల మంచు బిందువుల్ని సాంత్వన వచనాల స్పాంజి లాగేసింది!

మనసు గాయాలకు కాలమే మలాము! మూడు నెలల్లో మామూలు మనిషైంది పరిమళ!

"నన్నూ నా కొడుకునూ ఎన్నాళ్ళని సాకుతావు బావా? నాకో ఉద్యోగ్యం చూసి పెట్టు.''

''నా గుండె గుడిలో కొలువున్న . వతకు నిత్య నీరాజనా లందించడం నా విధి పరిమళా!''

"బావా....!''

"ఔను పరిమళా! . నిప్పటికీ నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నా ప్రేమ దేవతకు సేవలందిస్తుంటే నాకెంతో తృప్తి."

"మరైతే...." కనుబొమ్మలు పీట ముడేసుకున్నాయి.

''నువ్వు బాధపడితే చూడలేను సుమా!''

"....నేనిప్పుడు రమేష్ కొడుక్కి తల్లిని బావా!''

"నీ కొడుకును. నా కొడుగ్గా భావించే ఆత్మస్థైర్యం నాకుంది.''

మరో మూడు నెలలు కాలగర్భంలో కలిసిపోతూ సుగుణాకర్ తండ్రిని వెంటలాక్కెళ్ళాయి. వన పోరాటంలో ప్రతి మనిషిలో ఆశల ఆరాటం.

''పసివాడితో జీవితంలో ఒంటరి పయాణం చేయగలనా? ఒంటరి యువతి కెదురయ్యే ఆకలి చూపుల నుండి ఎన్నాళ్ళు తప్పుకోగలను? సుగుణాకర్ మంచితనాన్ని ఇంకెన్నాళ్ళు భరించాలి? వరాలిచ్చే వుణ్ని అడుక్కుంటూ పోవడమే ధర్మమా?....''పరిమళ అంతరంగంలో అంతు లేని సంఘర్షణ.

శిశిరంలో ఆశల ఆకులు రాల్చిన చెట్లు వసంతాగమనంతో మళ్ళ చిగురించాయి. పాల సముద్ర మథనం చివర అమృతంలా వెలువడిన పరిమళ నిర్ణయం ఆమెను తిరుపతి కొండమీద సుగుణాకర్‌కు అర్ధాంగిగా మార్చేసింది. ఒడుదుడుకులు లేని ఆరునెలల సాంసారిక జీవితం మూడు నెలల గర్భవతిగా ఆర్వదించింది.

"ఈరోజు వైకుంఠ ఏకాదశి. రమేష్‌కు పిండ పదానం చేయించాలి పరిమళా!"

'ఔను తొలి యౌవన సుక్షేత్రంలో ఊహల విత్తనాలు చల్లి మధురానుభూతులనే ఎరువులు సి అనుభవాల పంటలందించిన రమేష్ ఆత్మకు, పుణ్యలోకాలను పునీతం చేస్తున్న రమేష్‌కు పిండ పదానం చెయ్యాల్సిం కాని.... కాని.... పావ మనసు బహు గొప్పది.'

"ఎవరూ ఇంట్లో....?" ఏకంగా లోపలికొచ్చిందో ఆకారం. లోతుకు పోయిన కళ్ళు, ముడుచుకుపోయిన దవడలు, పెరిగిన గడ్డం, మాసిన గుడ్డలు....ఆగకుండా దేశమంతా పాదయాత్ర చేసొచ్చినవాడిలాగున్నాడు.

"పరిమళా!.... ను.... నేను పరిమళా!'' లోతైన చేదబావిలోంచి వచ్చినట్టుందా ధ్వని.

పరిమళ కళ్ళల్లో ఆనందం. మొహమ్మీద ఆందోళన. కాళ్ళల్లో వణుకు. అరచేతుల్లో చెమట. గుండెల్లో సుడిగుండాల చెలగాటం.

"మీరు.... మీరు.... రమేష్!''

"ఔను రమేష్! వీరెవరూ?''

ఖిన్నురాలై గోడకొరిగి శిల్పంలాగై పోయింది. ఎన్నో అడుగుదా మనుకున్నా, ఏ ఒక్కమాటా గొంతు దాటడంలేదు.

"ఎ నెవరినో చెబుతాను కాని, ముందు మీరెలా బతికి బయట పడ్డారో చెప్పండి.'' సుగుణాకర్ సోఫా చూపించాడు.

"వైకుంఠ ఏకాదశినాడు నేను రాజమండ్రి బస్సెక్కి బోతుంటే నా క్లాసుమేటు, ప్రియ స్నేహితుడు బస్టాండులో దిగాడు నా కోసం. అతన్ని కూడా సుకుని గోదావరి స్నానాని కెళ్ళాను. స్నానాలు ముగించాం. చదుకునేప్పటి అలవాటు పకారం ఒకరి డ్రెస్సు లొకరేసు కుని నాటుపడవలో షికారుకెళ్ళాం. కొంతదూరం వెళ్ళగానే అనుకోకుండా నదీ ప్రవాహవేగం పెరిగింది. పడవ నడిపేవాడు కొత్తవాడట. పడవ తలక్రిందులైంది. అం గుర్తుంది. మెలకువ వచ్చేసరికి జాలరుల ఇంట్లో ఉన్నాను. కొట్టుకు పోతున్న నన్ను కాపాడారట. విపరీతమైన గాయాలతో స్పృహతప్పిన నాకు మందూ మాకూ ఇచ్చి రెండు నెలల్లో బాగుచేశారు. ఆ ఊరునుంచి ఈ ఊరికొచ్చి బస్ దిగగా, మా నాన్నగారి మనుషులు నన్ను పట్టుకెళ్ళారు. నన్నో గదిలో బంధించారు. పరిమళను మరిచిపోయి మరో పెళ్ళి కొప్పుకొమ్మన్నారు. నేనొప్పుకోలేదు. మాయో పాయంతో తప్పుకుని వచ్చానిప్పు .''

గుండెలనిండా ఊపిరిపీల్చుకుని జరిగిన సంగతులన్ని వివరించాడు సుగుణాకర్. చివరికి "తెలియక జరిగిన తప్పిదాన్ని క్షమించండి. ఇక నేను తప్పుకుంటాను. పరిమళ మీదే!'' అన్నాడు గుప్పెడు విషాన్ని గొంతులో దాచుకున్న పరమశివుడిలా.

''కాదు.... నేను తప్పుకోవడమే న్యాయం. పరిమళ మీదే"

''కాదు. దయచేసి అలా అనకండి. ఎక్కడైనా సరే, పరిమళ సుఖంగా ఉంటే నాకదే పదివేలు."

''ఎను కోరుకునేదీ అదే. నా హృదయవిపంచి పరిమళ సుఖమే నాక్కావాల్సింది. అది చాలు. నేనొస్తా."

"నా....న్నా....!" బుడి బుడి నడకల బాబు సుగుణాకర్ కాళ్ళను చుట్టేశాడు ఎత్తుకొమ్మ ని.

''బాబూ!" రమేష్ కళ్ళల్లో రతనాల మెరుపు. గుండె పొంగింది. బాబు నెత్తుకోబోతుంటే తప్పుకున్నాడు భయంగా.

త్యాగమనే బరిలో ఇద్దరూ కుస్తీ పడుతున్నారు.

రెండు కళ్ళల్లో న్ని త్యాగం చెయ్యాలి? రెండు కాళ్ళల్లో దేన్ని కొట్టేసుకోవాలి? రెండు చేతుల్లో న్ని నరి సుకోవాలి?.... పరిమళ మెదడులో కల్లోల సము ద తరంగాలు....

ఐదు నిమిషాలు కాలం స్తంభించింది.

రమేష్, సుగుణాకర్లిద్దరూ లేచారు.

కొన్ని టన్నుల బరువెక్కిన గుండెలతో వెళ్ళిపోతున్నారు.

''ఆగం .... ప్లీజ్.... ఆగండి!" అనురాగపు ఆవేశం పరిమళ గొంతు దాటింది. మైనంలా కరిగిన ఆమె గుండెకాయను మొండి ధైర్యం అవహించి గుండ్రాయిలా తయారుచేస్తుంది.

ఇద్దరూ వెనుదిరిగారు. పరిమళ పరాశక్తిగా, కారణజను రాలిగా కనబడింది. పిల్లల్ని మందలించే తల్లిలా నిల్చుంది.

''నా కిద్దరూ కావాలి.... నేనిద్దరిదాన్ని."

''అదెలా సాధ్యం?" కోరస్!

''సాధ్యమే! వీడు మన ముగ్గురి కొడుకు! మరో ఆరు నెలల్లో పుట్టబోయే ప్రాణి మన ముగ్గురిది. అప్పుడు మీ ఇద్దర్నీ కలిపి నాకు నలుగురు పిల్లలు. నలుగురూ నాకు నాలుగు ప్రాణాలు! నా ప్రేమ పరిమళాలను నలుగురికీ సమానంగా పంచగలను. ప్రేమాభిమానాలనూ సమానంగా స్వీకరించగలను...."

(గీతాంజలి, డిసెంబర్ - 5, 99 .)

# అతుకుల బొంత

బజారులో నడి జనాలను అ పనిగా చూస్తున్న అన్నపూర్ణమ అరుగుమీద కూచుం కాని, మనసంతా అల్లకల్లోల సము దం లాగుంది. నుదుటి గీతలు అనుభవం తాలూకు హద్దులుగా మిగిలాయి.

వితమంటే రంగుల అతుకుల బొంత అని అప్పుడనుకు అవ కాశం రా దు.

ఆశల పల్లకిలో ఊరేగుతూ పదిహేను సంవత్సరాలు భర్త చల్లని నీడలో హృదయపుష్పం వేయి రేకులుగా విప్పుకుంది. అప్పుడు అదృష్ట జాతకమంటే తన అనుకుంది. ముద్దుగా ముగ్గురు పిల్లలకు తల్లైంతర్వాత తనను ఒంటరిదానిగా మిగిల్చి పరలోకయాత్రకెళ్ళిన భర్త జ్ఞాపకాలు గుండెల్ని పిండేస్తుంటే తనంతటి దురదృష్టజాతకురాలీ లోకంలో ఎవ్వరూ లేరనుకుంది. భూ నభోంతరాలు ఏకమై తనమీద పడినా గుండె రాయి చేసుకోగలిగింది.

ప్రయత్నానికి పట్టుదల జోడైంది. అష్టకష్టాలను ఆత్మస్థైర్యం ఎదురించింది. భర్త ఆశయాల కనుగుణంగా పిల్లల్ని ప్రయోజకులుగా చేయగలిగినందుకు అసలు సిసలైన అదృష్టం తనదే నన్పించింది.

పైవాడి లలకు పరాకాష్ట మానవ జీవన చదరంగమే. అలా అనుకునేందుకు బోలెడన్ని ఆధారాలున్నాయి. పెద్ద కొడుకు-అదే అన్న పూర్ణమ్మ కూచున్న అరుగు బాపతు రామనాథం సంసారాన్ని ట్యూషన్ల బండిమీద చాకచక్యంగా నడిపించగల సర్కారు బడిపంతులు. మాథ

మేటిక్స్ అనే బండరాయిని బోధనాపటిమతో పిండిచేసి ఉదాహరణలు తీపి కలిపి విద్యార్థులకు తినిపిస్తాడు.

అణుకువ అంటే ఏమిటో పెద్దకోడలు రాజ్యలక్ష్మి ని చూచి నేర్చుకోవాల్సిందే. తాను అంట్లు తోముతానంటే—

"అత్తగారిచేత అంట్లు తోమించే దుర్మార్గం నాకంటగట్ట వద్దత్తయ్యా!" అని వారిస్తుంది.

వంటలో సాయం చేస్తానంటే-

"ఈ పనులకు నేనున్నానుగదత్తయ్యా! మీరలా కూచోండి!" అంటూ చేతులు జోడిస్తుంది.

నీళ్ళు చేదేందుకు బావి దగ్గరకెళ్తే

"పెద్ద ప్రాణం, మీకెందుకు శ్రమ!" అంటూ బొక్కెన లాక్కుంటుంది.

"ఏ పనీ చెయ్యకుండా ఎలా ఉండగలనమ్మా?" అని విసుక్కుంటే-

"ఇన్నాళ్ళ రెక్కలు ముక్కలు చేసుకుని కొడుకుల్ని చదివించారు. పెళ్ళిళ్ళు చేశారు. ఇక విశ్రాంతి తీసుకోండత్తయ్యా!" అంటుంది.

"పనిచేసే రెక్కలూ, పారాయణంచేసే నోరూ ఊరుకోవురా రామనాథం!" అందోసారి కొడుకుతో.

"పనులు మాకప్పజెప్పి నువ్వు పారాయణం చేసుకోమ్మా! పూజలకూ, హరికథలకూ వెళ్ళు. మనుమలూ, మనమరాళ్ళతో ఆడుకోవే!" ఉచిత సలహా పారేశాడు.

అంటే.... రెక్కల్ని కట్టగట్టి అటకెక్కించాలన్నమాట. పని మానేసిన యంత్రం తుప్పు బట్టినట్టు తన రెక్కలు నిర్వీర్యమైపోతే రోగాలూ, రొప్పులూ చుట్టుకోవా? పెద్దకొడుకూ, కోడలూ ఓ పథకం

కారం తన ఆయుర్దాయాన్ని తగ్గించాలనుకుంటున్నారా? ఈ వయసులో ఏ పనీ చెయ్యకపో శరీరానికి వ్యాయామమెక్కడిదీ?

ఏమాటకామాటేచెప్పుకోవాలి. రెండవవాడు నారాయణమూర్తింట్లో ఎంత ప్రజ్ఞసినా అడ్డుచెప్పేవారుండరు. వాడి భార్య నాగమణి నవ్వితే నవరత్నాలు రాల్తాయేమో నన్పిస్తుంది. సన్నని నడుము, సన్నజాజి ముక్కూ, తళుక్కుమ ఒంటిరాయి ముక్కుపుడక.... ల క్ష్మి విలా ఉంటుంది.

"నేను స్నానానికెళ్తున్నాను. కాస్త పొయ్యిమీద బియ్యంపడెయ్యం డత్తయ్యా!" అనో—

"పిల్లల బడికి టైమైపోతుంది. వాళ్ళకు మీరు నీళ్ళు పోస్తేనే తృప్తి...." అంటూనో ఎన్నో పనులు పురమాయిసుంది, కడుపులో చొచ్చినట్టు.

నారాయణమూర్తి గూడా అం .

"బేరాలు చెయ్యడం మాకు చేతగాదు. కాస్త నువ్వే బజారుకెళ్ళి కూరగాయలు తేమ్మా!"అని సంచి చేతికందిస్తాడు.

"నీ కోడలి కసలు పైసలంటే ఫర్వా లేదు. నెలకెన్ని సరుకులు వాలో అసలే తెలీదు. ఆ సరుకులేవో నువ్వే కొనుక్కురామ్మా!" అని అతడు బతిమాల్తుంటే తన అంతరంగం మబ్బుల ఆకాశాన్ని చూచిన మయూరంలా గంతులేస్తుంది.

''అమ్మా! నువ్వు నా ఇంట్లో ఉంటే నాకు కొండంత ధైర్యమే. నువ్వెప్పటి ఇక్కడే ఉండిపో. తల్లి సేవ చేసుకునే భాగ్యం కలిగించమ్మా!" అంటూ బిస్కెట్ తింటున్న పిల్లాడిలా ఇదైపోతాడు.

'నేనంటే వాడికెంత ప్రేమనో' అనుకుంది.

కాని....వాని వృ_, పవృ_ః అంతా వ్యాపారమే, తియ్యని మాటలతో ఎదుటివారిని అవ లగా సీసాలోకి దించేస్తాడు. పతి చిన్న విషయాన్ని గూడా డబ్బుతో చూస్తాడన్న సంగతి ఆలస్యంగా అర్థం మైంది.

ఓ రోజు ... రిగ్గా కూర్చునుంది. ఆక్సిడెంటులో పోయిన భర్త అంగలార్పులు కళ్ళముందు మెదిలి గుండెల్ని మెలిపెడ్తున్నాయి. చివరి శ్వాస వదిలే ముందు ఆదని పెదాలు చీల్చుకువచ్చిన మాటలు చెవుల్లో గింగురుమన్నాయి.

''పూర్ణా! మనకు ముగ్గురు కొడుకుల నిచ్చిన ఆ వుడు ఒక్క ఆడ నలుసునైనా పసాదించలేదని కుంగిపోయావు కదూ! మన కొడుకు లకు పెళ్ళిళ్లై కోడళ్ళొస్తారు. వాళ్ళే మన కూతుళ్ళనుకో.... నిన్నూ.... పిల్లల్ని అగాధంలో వదిలేసి వెళ్ళి....పో....తున్నా. నా కళ్ళతో పిల్లల్ని చూడు. నీ ప్రేమలో నా ప్రేమకలిపి పయోజకుల్ని చేయి.మనకున్న ఈ.... ఇ....ల్లూ రెండెకరాల మాగాణీ అమ్మె నాసరే జాగా చ....ది....విం....చు! నాకై ఇంకా బతకాలని ఉంది. కా....కాని....నా రెండు కాళ్ళూ విరిగినై. ఎడమ చెయ్యి ఎక్కడ పడిందో తె.... .... దు.... పిల్లలు .... నా.... పి....ల్ల....లు."

అం -పంజరమనే శరీరంలోంచి పక్షి అ ప్రాణం ఎగిరిపోయింది.

ఆ రో భర్త సంవత్సరీకం. దినమంతా ఆ మహానుభావుని జ్ఞాపకాలే.

రా తి పది కావస్తుంది. తన పక్కనున్న పిల్లలు ని దలోకి జారుకుంటున్నారు. ఎంత పయత్నించినా ని దా వి కరుణించలేదు. పక్క గదిలోంచి మాటలు వినబడుతున్నాయి.

"వైధవ్యం ఎంత భయంకరమో....ఈ రోజు అత్తయ్య కన్నీళ్ళు చెప్పాయండి!" నాగమణి గొంతు.

"ఔను. నేను కూడా గమనించాను. అమ్మ కు నాన్న గుర్తొచ్చుంటాడు" - నారాయణమూర్తి.

"అంత కాదు. నాకో అనుమానం గూడా!"

"ఏమిటది?"

"అత్తయ్య వచ్చినప్పుడల్లా మీరు పనిమనిషిని మాన్పిస్తున్నారు. పెద్ద ప్రాణంగదా పాపం! అన్ని పనులూ చెయ్యలేక అల్లాడిపోతుం మో నం !...."

"అలాగంటే ఎలా నాగూ! మా అమ్మ వచ్చినప్పుడల్లా మన ఇంటి ఖర్చు పెరుగుతుంది గదాని పనిమనిషికిచ్చే జీతం కలిసొస్తుందని మాన్పిస్తున్నానం ! నీ కెందుకా బాధ?"

"అ-ఏ....అదేం బాగా లేదండీ! రేపే పనిమనిషిని రమ్మంటాను."

"నీ మొహం, నీ ం దెల్సు? పనిమనిషి పాచిపని, ఇంటిపనంతే చేస్తుందిగాని బట్టలుతకదు గదా? మా అమ్మైతే ఆ పని గూడా చేస్తుందాయె! పనిమనిషుంటే అమ్మకు పని చెప్పాలంటే నీకు నోరురాదు. ఆ బట్టలుతికే పని నీ నెత్తిమీద పడుతుంది. ఐనా .... .... అమ్మకున్నంత విశ్వాసం ఆ పనిమనిషి కుంటుందా?"

"ఏమోనండి, నాకు మాత్రం...."

"పిచ్చి పిచ్చి ఆలోచనలు మాని పడుకో! నీ కసలు డబ్బు విలువ తెలిసి ఏడిస్తే గదా!"

నారాయణమూర్తి మాటలు ఈపెలై గుండెలకు సూటిగా గుచ్చుకున్నై. బాణం దెబ్బకు నేలకూలిన పావురంలా గిలగిలలాడిందిప్రాణం .

భగవాన్....! నా కొడుకింట్లో నేనో విశ్వాసంగల కుక్కనన్న మాట? తండ్రిలేని పిల్లల్ని గారాబంగా పెంచింది ఇందు నా? చదువుతో పాటు సంస్కారమబ్బుతుందనేది భ్రమేనా? కన్నకొడుకులో క్ష ప్రేమ! గుండెలు మెలిపెట్టినట్టనిపించింది. నిజానికి ఎవరికి ఎవరీ లోకంలో? తిరుపతి కొండెక్కుతూ కాలుజారి లోయలో పడిపోతున్నట్టనిపించింది.

తెల్లవారకముం తయారై ఈ ఊరొచ్చింది. అక్కడి సంగతు లేవీ పెద్దకొడుక్కు తెలీవింకా.

మరి....చిన్న కొడుకు వెంకటేశో?

వాడో పెద్ద ఇంజనీర్. పక్కా భవనాలను చక్కగా కట్టించగలడు కానీ, తన సంసారమ భవనాన్ని పునాదులు లేకుండా కట్టెయ్యాలను కు అమాయకుడు.

ఏరి కోరి చీఫింజనీర్ ముద్దులపట్టి మణిమాల మెడలో మూడు ముళ్ళేసి ముల్లోకాలు జయించినట్టు మురిసిపోయాడు. పెళ్ళవగా మెరిట్ లిస్ట్‌లో ప్రమోషన్ కొట్టేశాడు గూడా.

మణిమాల గారాబంగా పెరిగిందట. పాలలో ఎర కుంకుమ కలిపినట్టున్న నున్నటి దేహం. పున్నమి చందమామను వెక్కిరించగల ముఖారవిందము. చారె సి కళ్ళూ, చెక్కిన ముక్కూ....వయసుపొంగుల బుసబుసల్లో పెద్దింటి పిల్లననే అహంకారము కొట్టొచ్చినట్టు కనబడు తుంది. మొగుణ్ణి కొనకొంగుకు ము సుకుని సినిమాలకూ, షికార్లకూ, పార్టీలకూ తిరుగుతూంటుంది. ఇష్టం లేకున్నా రత్నంలాంటి రత్నకు తల్లయింది.

"నువ్వూ పుట్టి నా అందాన్నంతా కొల్లగొట్టావే ముదనష్టపు మొహమా!" అంటూ పసిదాన్ని ఎన్నోసార్లు చీదరించుకుంది. తల్లి పాలకు నోచుకోలేక రత్న తన పాలైంది. పాల డబ్బాలతో రెం ళ్ళు గడిచినై.

మణిమాల రత్నను చీదరించుకుంటూంటే తన కడుపులో పేగులు కల కలమనేవి. కోపం ముందుకొచ్చేది.

"ఆడదానికి మాతృత్వమో వరం తల్లీ! కన్నపిల్లల్ని స్వయంగా లాలించి పోషించడమో తియ్యని అనుభూతమ్మా!" అందోసారి ఉండబట్టి లేక.

"ఆహాఁ!" మణిమాల మూతి మూడువంకర్లు తిరిగింది."మాతృత్వ మంటే అదేమన్నా అందాల పోటీల్లో గెలుచుకున్న అపురూపమైన బహుమతా? ఐనా.... ఆ బహుమతి నాక్కూడా తగిలింది గదా? ఇహ పెంచడమంటారా?....ఇంత పెద్ద బంగళాలో, ఇంతమంది నౌకర్లుండగా, కావల్సినంత డబ్బుండగా, పెంపకాని కేం లోటు?" గుండెలలో పోటు ముక్కుపుటాలు లయబద్ధంగా ఎగిరిపడినై. తన మనసు డి మంగ లంలో పేలాల్లాగా వేగిపోయింది.

"కాని.... తల్లిప్రేమ సంగతేమిటమ్మా ?"

"దానిమీద ప్రేమలేనిదే పదినెలలు కష్టపడి మోసి కన్నానా?" ముద్దమందారంలాంటి మొహం మంకెనపూవైంది:

"కనడం కాదమ్మా!.... పసిదాన్ని...."

తన మాటలు వినే ఓపికలేక హాండ్‌బాగును వేళ్ళతో ఊపుతూ వెళ్ళిపోయింది.

వెళ్ళిపోతున్న తల్లినీ, తననూ మార్చి మార్చి చూచింది రత్న.

"నానమ్మా!" అంటూ తన ఒడిలో వాలింది.

వాసనలేని పూపులా మారిన వెంకటేశం సంసారం ఎట్లా గట్టె క్కుతుందోనని భయమేస్తుంది.

విషయమంతా వెంకటేశ్ చెవిలో వేసి "తల్లిదం డుల ప్రేమంటే లాలనా, పాలనా. అం కాని, బంగళాలు, నౌకర్లు కాదురా! నీ పని మీద నువ్వెళ్తావు. పనిలేని పనిమీద కోడలు వెళ్తుంది. పసిదాన్ని పట్టించుకు. వాళ్లెవ లా?" నిలదీసింది.

"నీకు తె ం ముంచమా ?" ఆఫీసుకెళ్ళబోతున్న వెంకటేశ్ ఆగి, "మణిమాల కోటీశ్వరులింట్లో పుట్టి కాలికి మట్టి అంటకుండా పెరిగింది. జీవితమ నాణానికి రెండువైపులా సుఖమ బొమ్మే ఉంటుందన్న వాతావరణంలో చదివింది. కష్టమనే బోరుసు ఆవిడకు తె దు. ఏదో.... మనమే సర్దుకుపో సరి" అ శాడు.

"మన సంగతి కాదురా, అశుభం-శుభం తె ని ఆ పసిదాని సంగతి! తల్లిదం డుల లాలనకు దూరమైన రత్నను చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతుంది బాబూ!"

"నీకు కష్టమన్పిస్తే చెప్పమ , ఓ ఆయాను కుదుర్చుతాను...."

"ఆయాను తేగలవు కాని, అమ ప్రేమని...."తన మాట పూర్తిగా వినకుండా వెళ్ళిపోయిన వెంకటేశ్ సాయం తం ఆయాతో తిరిగొ చ్చాడు.

లాగి చెంపదెబ్బ కొట్టినట్టనిపించింది.

పసితనమ మమతల పొలానికి తల్లి పేమ గంగాజలం లాంటిది. కృత్రిమమైన ఆయా పేమ సము దజలమే కదా?.... కాని, తన అభి పాయమెవరిక్కావాలి?.... ఎవరికి ఎవరీ లోకంలో? ఎవరి దారి వారిది.

ఇహ తన అవసరం కనిపించలేదక్కడ.

జరిగిన రోజులు మెదడు పొరల్లో దోబూచులాడుతూంటే

"పోస్ట్!" క వినబడింది.

"అన్నపూర్ణమ్మ ఎవరం ?"

"... బాబూ!"

ఉత్తరం అందుకుని లోపలికి నడిచింది భారంగా.

"అమ్మా!" నలభయ్యేళ్ళ రామనాథం నాలుగేళ్ళ పిల్లాడిలా పిలిచాడు. నిండు నవ్వులో పండువెన్నెల చల్లదనముందా పిలుపులో. అన్నపూర్ణమ్మ కనురెప్పలు పైకిలేచాయి, "ఏమి"టన్నట్టు.

"మూ ్డ్రోజులైతే ఉగాది పండగ...."

"ఔను...." ఇన్‌లాండ్ లెటర్ విప్పింది.

"ఈ పండక్కి నువ్విక్కడే ఉండాలమ్మా !"

అలా ప్ర త్యేకంగా అడగడంలో అంతర్యమేమిటో? నిజానికి తనక్కడుండాలని వచ్చింది గదా! ఆవిడ నొసలు ముడిపడి కనుబొమలు పశ్నార్థకాలైనై. ACC NO - 8576

"ఏం లేదమ్మా ! .... నన్నూ, నీ కోడల్ని పండక్కి రమ్మని మా మామగారు ఉత్తరం రాశారు. ఉగాదికి అత్తారింటికి వెళ్ళక ఐద్నేళ్లైందమ్మా!" 894 S133

"శుభం, వెళ్ళిరండి." CHA

"పండగ మర్నాడు మా అత్తామామలు కాశీయాత్రకెళ్తున్నారట. మేము గూడా వాళ్ళతో అట్నుంచటే వెళ్ళి రావాలనుకుంటున్నామమ్మా! పిల్లల్తో నువ్విక్కడే ఉంటే...." UC 200

"నేను గూడా కాశీ యాత్ర కొస్తాన్రా!" గుండెల్లోంచి ఉబికొచ్చిన మాటలు పెదాలు దాటలేదు.

"పిల్లల చదువులై, పెళ్ళిళ్ళై స్థిరపడ్డాక మనం హాయిగా కాశీ, రామేశ్వరం తీర్థయాత్రలకెళ్దాం పూర్ణా!" వెంకటేశ్ అక్షరాభ్యాసం

రోజున తన ననుసయించిన భర్త ఏ లోకాన ఉన్నాడో? ఆనాటి స్వప్న మందిరం ఈ రోజు కూలిపోయింది. కడుపులో చల్లజేసినట్టవుతూంది.

"మీరు తిరిగొచ్చాక నేను వెళ్ళిపోవాలన్న మాట?" అంటూంటే కడుపులో దాగలేని ఎసరు కళ్ళకు పాకింది. కింది పెదవి మునిపళ్ళమధ్య ఇరుక్కుపోయింది.

"అబ్బే .... మా ఉద్దేశ్యమది కాదత్తయ్యా!" రాజ్యలక్ష్మి అందుకుంది: "మీ రెప్పుడూ మా దగ్గరే ఉండాలి, మీ సేవ చేసే భాగ్యం మా సొంతం కావాలత్తయ్యా!"

కళ్ళను కమ్మిన నీటిపొరలు ఉత్తరాన్ని చదవనీయడం లేదు.

"నీ పెద్ద తమ్ముడు నారాయణమూర్తి నుండి ఉత్తరమొచ్చింది చదువు" - అందించింది కోడుక్కి.

"అమ్మ పాదపద్మములకు నమస్కరిస్తూ వ్రాయునది -

అమా ! గతవారం రోజులుగా నేను ఒడ్డుకేసిన చేపపిల్లలా కొట్టుకుంటున్నాను. నా వ్యాపార భాగస్వాములు పథకం ప్రకారం నన్ను మోసం చేశారు. ఫలితంగా ముప్పై లక్షల రూపాయల నష్టం లింది నా వంతుకు. ఈ షాక్‌కి తట్టుకోలేక నీ కోడలు మంచం పట్టింది. వారం రోజుల్లో ఇల్లు అమ్మేస్తాను. నువ్వు వెంట రావాలి. నువ్వొస్తే నాకు కొండంత ధైర్యమొస్తుందమ్మా!...."

ఉత్తరం చదివాడు రామనాథం.

అన్నపూర్ణమ్మ అంతరంగం కొంగలు దొక్కిన మడుగై పోయింది.

"పాపం, తమ్ముడు వ్యాపారమే సర్వస్వమనుకున్నాడు గదా!" రామనాథం మాటల్లో దాగున్నది సానుభూతో, వెక్కిరింపో అర్థంకాలేదు.

"టెలిగ్రాం.... అన్నపూర్ణమ్మ గారికి టెలి గ్రాం...." టెలి గ్రాఫ్ మెస్సెంజర్ సైకిల్ గంట గణగణా మోగింది.

"రత్న సీరియస్, డాక్టర్స్ అడ్వైజ్ యువర్ ప్రెజెన్స్ కంపల్సరీ ఫర్ హర్ రికవరీ, అదర్‌వైజ్ డేంజర్ - వెంకటేశ్."

రామనాథం చదివిన టెలిగ్రాం పూర్తిగా అర్థంకాకపోయినా అందులో ఆపద సమాచారమేదో ఉందని తెలిసిపోయింది.

"అంటే ఏమిటా?" గుండె గుబగుబ లాడింది.

"వెంకటేశ్ కూతురు రత్నకేదో జబ్బుముంచుకొచ్చిందట. అది కోలుకోవాలంటే నువ్వక్కడుండాలట. - కపో అపాయమన్నారట డాక్టర్లు."

"అరెరే....దైవోపహతురాలు!....నామీద బెంగబెట్టుకుం మో...." అన్నపూర్ణమ్మ కళ్ళల్లో రత్నతళుక్కుమంది.

ఇప్పు ం చెయ్యాలి?

'ముగ్గురు కొడుకుల పిల్లల్లో నా రక్తముంది. కాని....ఎవరి బాగోగులు వారే చూచుకుంటున్నారు గదా! ఎటూ వెళ్ళకుండా మెదల కుండా ఉంటే సరి! నేనూ కాశీయాత్ర కొస్తానని రామనాథంతో ఖచ్చి తంగా చెప్పేస్తే అయేదేముంది? ఎవరికెంత చేసినా ఇంకా చేయించు కోవాలనునేవాళ్ళే. ర్థయాత్రలకెళ్ళే అవకాశం నాకెక్కడుంటీ? ఔను... ఎవరి స్వార్థం వారిది. ఎవరి మోక్షమార్గం వాళ్ళు వెతుక్కోవాల్సిం ....'

అన్నపూర్ణమ్మ ఆలోచనలను చీల్చుతూ ఆలిండియా రేడియో గీతా మకరందం ప్రసారం చేస్తుంది....

"తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర అసక్తోహ్యాచరన్ కర పరమాప్నోతి పూరుషః....

# జానకమ్మ మొగుడు

"ఇంట్లో ఒక్క నీటిచుక్క లేదు. , ముందు పట్టుకుంటా." దివి నుండి అప్పు భువికి దిగివచ్చిన గంధర్వ క లా హొయలు ఒలకబోస్తూ బిందెను కుళాయి ముందుకు జరిపిందో జవరాలు.

"అదెలా? , ను ముందొచ్చాను, ముందు . , పట్టుకుంటా." ఆవిడ బిందెను జబర్దస్తీగా వెనక్కు నెట్టిందో చిత్రాంగి-

". ను మడిగట్టుకొచ్చి గంటసేపైంది. ళ్ళు లేక పూజ ఆగి పోయింది. ముందు నన్నో చెంబెడు నీళ్ళు పట్టుకోనీయండమా !"

రాని నవ్వు శాస్త్రిగారి పెదాలమీద బలవంతంగా గంతులేసింది.

"అ ంకుదర్దు. అందరికంటే వెనకొచ్చి ముందు పడతానంటే.... ఇదేమన్నా సినిమా టిక్కెట్టా?" చిత్రాంగి ముక్కుపుటా లెగిరిపడినై.

"అయ్యో, అయ్యో! పాపం, పుణ్యం ఏదీలేదా? పూజకు నీళ్ళు పట్టనివ్వకుంటే పురుగులుబడి చస్తారు. మళ్ళీ జన్మలో ఎనుబోతై పుడ తారు...." శాస్త్రిగారి అర్ధాంగి అన్నపూర్ణమ్మ దండకమందుకుంది.

"....ఏయ్, మాటలు కాస్త జాగ్రత్తగా రానీ!"

"చిన్నంతరం పెద్దంతరం లేకుండా మాట్లాడ్తే చెవుల గూబలు పగుల్తాయ్...జాగ్రత్త!"బుగ్గనున్న తాంబూలంతాలూకు రసబిందువులు.... మూడ్రోజులకోసారి ముచ్చటగా పలుకరించే మున్సిపల్ కుళాయి చుట్టూ పడిగాపులు గాస్తున్న మహిళల చీరెలమీద పడ్తున్నై. రాబోవు తుఫాన్ని ముం పసిగట్టిన శాస్త్రజ్ఞుడిలా.... చల్లగా జారుకున్నారు శాస్త్రిగారు.

"అవ్వ! ఇదేమి ఎంగి ?" కోపంతో బిందె లేపిందొక దృద్రపు వి.

"శుభమాని కొత్త గుడ్డలేసుకుని కుళాయి దగ్గరికొస్తే....వాటిమీద ఉమ్మేస్తావే పాపపుదానా?" పళ్ళు నూరిందో ఝూన్సీరాణి.

నలుగురూ నాలుగు రకాలుగా తిడుతూంటే అన్నపూర్ణమ్మ పరువు గోదావరిలో కొట్టుకుపోయింది.

ఋద్రలో భూగోళం బద్దలైంది. తన వర్గానికి కనుసైగజేసి -

"మీ పిండాకూడు!" ఇంకేదో అనబోయేలోగా చి తాంగి బిందె ఆవిడ వీపుమీద ఢామ్మంది. చిత్రాంగి సిగ అన్నపూర్ణమ్మ చేతికొచ్చింది.

అన్నపూర్ణమ సిగ రుద్రమ చేతిలో.రు దమ్మసిగ బ దకాళిచేతుల్లో.... సీళ్ళరాని కుళాయి ముందు మహిళలు రెండు పార్టీలుగా విడిపోయారు.

బిందెలే ఆయుధాలుగా.... జడలూ, సిగలూ టార్గెట్స్‌గా పచ్చన్నయుద్ధం చెలరేగింది.

మతకల్లోలాలు రేపి మారుమూల నుండి తమాషా చూస్తూన్న నాయకుడిలా, కుళాయికి వంద గజాల దూరంలో నిల్చున్న అమ్మణ్ణి.

"అదిగో.... జానకమ్మ మొగుడు! అతణ్ణి పోలీసులు పట్టుకెళ్తున్నారు!" అరిచినంత పంజేసింది.

రెఫరీ ఈల వేయగానే ఆగిపోయిన కుస్తీ పోటీలా సిగపట్ల ఫీట్లకు స్వస్తి పలికి అటువైపే చూస్తున్నారంతా.

ఔను? చినిగిన గుడ్డలూ.... మాసిన గెడ్డం... బతుకు భారాన్ని చూడలేక లోతుకుపోయిన కళ్ళూ.... అతడు నరహరే.... జానకమ్మ మొగుడు! అత్తారింటికి మొదటిసారి వెళ్తున్న కొత్తల్లుడిలా ఇద్దరు కానిస్టేబుళ్ళమధ్య దర్జాగా నడుస్తున్నాడు.

"ఏ ఇల్లూ దొరకనట్టూ ఆ ఇంట్లో- ఎందుకు దొంగతనం చేశావురా హరీ?" కుడి కానిస్టేబుల్ చేతిక ౼ గాల్లోకి లేచింది.

"ఏయ్ పో సన్నా! మాటలు కాస్త జాగ్రత్తగా రానీ! రా, గీ అంటే మర్యాదగుండదు." వార్నింగిచ్చాడు నరహరి.

"హరిహరీ! . రస్థుడి గ్గూడా మర్యాదనా?" ఎడమ కానిస్టేబుల్ లాఠీ లేపబోయి విరమించుకుంది.

"అద్సరే.... అర్థబలం, అంగబలం అన్నీ ఉన్న వాళ్ళింట్లో- దొంగతనమెందుకు చేశారు నరహరిగారూ?" కవ్వించాలనుకున్నాడు కుడి కానిస్టేబుల్.

"నీరు పల్లమెరుగు, నిజము వుడెరుగునన్నట్టు ఉన్నోడింట్లోంచి లేనోడు పట్టుకెళ్తాడు. ఇన్నాళ్ళ పోలీసు ఉద్యోగం ఈ మాత్రం నేర్పలేదా?" కనుబొమలెగరేసి ఠీవిగా గెడ్డం పుణుక్కున్నాడు నరహరి.

తగలాల్సిన చోటే తగిలింది కానిస్టేబుళ్ళకు.

"జానకమ్మ మొగుడంటే ఏమో అనుకున్నా!" బుగ్గలు నొక్కుకుంది అన్నపూర్ణమ్మ.

"గడుసుపిండమే....!" చిత్రాంగి నోరుదెరిచింది.

ఇంత జరుగుతున్నా.... దుఃఖంలేని కళ్ళలా మున్సిపల్ కుళాయి మిర్రి మిర్రిగా చూస్తూం కాని, చుక్కనీరు రాల్చదంలేదు.

౦ ౦ ౦

నిండు కోర్టు.

"దొంగతనంచేశావా?" అడిగాడు జడ్జి నరహరిని.

నరహరి పచ్చిదొంగ అని గొంతు చించుకున్న పబ్లిక్ ప్రాసిక్యూటర్ అయూసమొచ్చి కూచున్నాడు.

జ వెనక పై భాగంలో బోసినవ్వు లొలకబోస్తున్న బాపూ పొడుస్తున్నాయి.... నరహరి చూపులు.

....నవ్వుతున్నావా మహాత్మా? రామరాజ్యం రావాలని కలలు గన్నావు గదూ? నీ కలల రాజ్యంలో లకోట్ల రూపాయలు దిగమింగి పెద్ద పెద్ద ప్రాజెక్టులు వెలిశాయి.

ఓ పక్క అతివృష్టి, మరో ప్రక్క అనావృష్టి. మాకేమో గొంతు తడుపుకునేందుకు మంచినీరు కాదుగదా, ఉప్పునీరు గూడా గతిలేదు. రెక్కాడి గాని డొక్కాడని నాలాంటివాడింతకంటే ఇం ంజేస్తాడనుకున్నావ్?

పశువులు నీళ్ళులేక అల్లాడి పోతున్నై. పొలాలు నోరుదెరుచుకూర్చున్నై, పక్షులు వలసబోతున్నై. ఊరి బావుల్లోని నీటిని సూర్యుడు తాగేశాడు. ఎవరి పర్మిషన్తో సూర్యుడంత ధైర్యం చేశాడు?

మున్సిపల్ నల్లా మూన్నాల్గురోజులకోసారి ముప్పై నిమిషాలు మూతులు దిప్పిపోతుంది. డబ్బున్న మారాజులు బోరింగులు వేయించుకున్నారు. మా ఇంటిపక్క దేవీలాల్ సేటు గూడా వేయించుకున్నాడు. నరహరి హృదయం ఘోషిస్తోంది.

"చెప్పవేమయ్యా! దేవీలాల్ సేటింట్లో దొంగతనం చేశావా?" మళ్ళీ అడిగాడు జడ్జి.

"చేశానండి!"

"ఎందుకు చేశావ్?"

"మూడ్రోజుల కితం కుళాయి దగ్గర నీటిబొట్టు దొరకలేదు. చెమటోడ్చి సంపాదించిన కూలీ డబ్బుల్లోంచి ఐదు రూపాయలు పెట్టి బిందెడు నీళ్ళు కొనుక్కున్నా. నిన్నరాత్రి మా కుర్రోడు.... వాడేనం .... మూడేళ్ళ వదుర్దాయ్- నీళ్ళు కావాలని మంకుపట్టు బట్టిండు. ప్చ్.... నీళ్ళ

దొరకదు. వీపుమీద నాలుగంటించాను. కన్నీళ్ళు చప్పరించి చప్పున పడుకున్నాడు. ఇది ఎండాకాలం గదం !.... నాకూ నా ఇంటిదాని కూడా నాలికలు పిడచగట్టుకు పోయినై. నీళ్ళకోసం అల్లాడుతున్నాం. మేం నిదబోకముం మా బడుద్దాయి నిదలేచి ఏడుపు లంకించుకున్నాడండి! కన్నకడుపు మా చెడ్డదండి.... మా గుండెలు నీరైపోయినై. అప్పుడం .... దేవీలాల్ సేటుగారి పహరీగోడ దూకేశానండి! భారమంతా భగవంతుని మీద ప సి వాళ్ళ బోరింగుకు ఓ బిందెడు నీళ్ళు కొట్టుకుని గోడమీంచి మా ఇంటిదాని కందించానండి. అం .... నా కర్మ కాలింది, పట్టుబడిపోయాను...."

"లాయర్ను పెట్టుకుంటావా?"

"దానికి డబ్బులు కావాలి గదం ? అ నా దగ్గరుంటే మరో బిందెడు నీళ్ళు కొనుక్కు- వాణ్ణి....'

"బెయిల్ దరఖాస్తు పెడతావా?"

"వద్దం ! బెయిలూ, గియిలూ నేనడగనండి! నాతోపాటు నా భార్యనూ, కొడుకునుగూడా జైలుకు పంపించండి సార్!.... మీకు పుణ్యముంటుంది సార్!.... అక్కడైతే నీళ్ళ వసతుంటుంది సార్!...." రెండు చేతులెత్తి నమస్కరించాడు.

(అమృత్ కిరణ్ 6- -1995)

రబ్బరు బొమ లాగుందప్పుడు. మరిప్పుడో?.... అన్నీ తెలిసిన ఆడ తనంతో నిండుగా....

"నీతో మాట్లాడను పో పిల్లా!" తెచ్చిపెట్టుకున్న కోపంతో ప్రవీణ్ పెదాలు బిగుసుకున్నాయి.

''ఏం బావా.... ఎందుకూ.... నామీద కోపమా?'' రెండు చేతుల్తో బావ తలనందుకుని కళ్ళలో కళ్ళు కలిపింది. పెదాలు కమ గా కదిలాయి.

''మా ఊరికొచ్చి ఇరవై నాల్గు గంటలు దాటాకనా - ను గుర్తొచ్చింది?'' మూతి ము శాడు.

గోదావరి తరగలా న వ్వసింది. ప్రవీణ్‌లో కవ్వింపు కదలిక.

''ఎంత కాబోయే పెళ్ళాన్నైనా మా తం మీ ఊరికి రాగా నీ ఒళ్ళో వాల్తాననుకున్నావా?'' మూతి గమ త్తుగా తిరిగింది.

"వాల్తేమా తం నష్టమేముందీ?" చెయ్యందుకోబోయాడు. దిగ్గున లేచింది. చెయ్యి బదులు కొంగు ప్రవీణ్ చేతికొచ్చింది. ఎత్తైన అందాలు అల్లరి పెడుతున్నాయి. లేవబోయాడు.

''ఆఁ ఆఁ.... అవన్నీ మూడు ముళ్ళు తర్వాతే బావా! నీ చదువు పూర్తి అయితే మన పెళ్ళైపోతుంది. అప్పుడు మనం చిలకా గోరింకలమై పోతాం గదా?" రెండడుగులు వెనక్కు జరిగి పైట సర్దుకుంది.

ప్రవీణ్‌లో కొంటెతనం జీవం పోసుకుంటోంది. ఏదో కావా లంటోంది.

''మరప్పటిదాకా?...." దగ్గరకు లాక్కుని ముక్కందుకున్నాడు.

"అప్పటిదాకా హద్దులు తప్పవు బావా!" పక్కకు తప్పుకుంది.

''మరైతే ఇప్పుడెందుకొచ్చావ్ నా గదిలోకి?''

"నీకిప్పుడు టిఫిన్ కావాలో, భోజనం కావాలో కనుక్కురమ్మంది అత్తయ్య" అంది గోడమీది పటాన్ని చూస్తూ.

గోపికల మధ్య కృష్ణుడు. రాస ల దృశ్యం. తైలవర్ణ చి తం బుగ్గల్ని ఎరుపెక్కించింది.

"ప్రస్తుతం వేడి డి టిఫిన్ వడ్డించు." భుజాలందుకున్నాడు. పెదాలందుకోబోయాడు.

"ఛీ పాడు!" తుర్రుమంది.

దోరమాగిన మామిడిపండు దోసిట్లోంచి జారిపోయినట్లనిపించింది. మేడ మెట్లు దిగుతున్న పావని కాళ్ళగజ్జెలు ఘల్లుఘల్లు మంటుంటే ఒళ్ళు పట్టుదప్పిపోతోంది.

వెంటనే పంటికిందికి రాని జాంపండు ఉట్టిమీదున్నా, చెట్టుమీదున్నా ఒకటే. పెదాలు చప్పరించాడు.

ఎమ్మేక్లాసులో ప్రొఫెసర్‌గారి తెలుగు పసంగం గంగా పవాహంలా సాగుతోంది.

ప్రవీణ్ కాలుకేదో మెత్తగా తాకింది. పక్కసీటు రోహిణి కాలు.

గుండెల్లో ఢిల్లానా! ఏవో గిలిగింతలు.

"...చివరగా ఒక్క విషయం. ఈ మనుచరి త మన చరి త. స్వారోచిష మను సంభవ గాథ. దీన్నో శృంగార కావ్యంగా భావించి కొట్టిపారెయ్యడానికి వీల్లేదు. ఒక ఆదర్శవంతుడైన గృహస్థు ప్రవరుని రూపంలో కనిపిస్తాడు...."

ప్రొఫెసర్ ప్రసంగం పవీణ్ చెవులకెక్కడం లేదు. రోహిణి సంత దగ్గరినుండి చూడ్డం అ ప్రథమం. కావాలని తన ఎడమకాలును ఆమె కుడికాలుకు తగిలించాడు. ఆవిడ కళ్ళు చక్రాలైనాయి. చూపులు కలిశాయి.

నవనవలాడే హచ్ఛాయ. నిగనిగలా బుగ్గలు. సోయగాన్నంతా సొంతం చేసుకున్న కనురెప్పలు. ఎత్తైన కొండలమీద పాకుతున్న కొండ చిలువలా గుండెలమీద ఒంటిపేట గొలుసు. పెదాల మీది చిరునవ్వు బుగ్గలకు జారింది. పలువరస నక్షత్రమాలలా మెరిసింది.

ప్రవీణ్ వెన్నెముకలో ఏదో పాకింది. ఒళ్ళు జిలజిలమంటోంది.

క్లాసైపోయింది, అందరితోపాటు రోహిణి బయటికొస్తుంది. ఆ నడక రాజహంసల్ని వెక్కిరిస్తోంది. ప్రవీణ్ కాళ్ళు ఆమె వెంట కదిలాయి.

గ్రౌండులోకొచ్చి విడిపోతున్నారంతా.

"రోహిణిగారూ!"

పిలుపు విని ఆగిపోయింది. పైట సరిచేసుకుంటూ "ఏమిటి?" అంది కళ్ళతో.

"మీరోసారి మా ఇంటికి రాకూడదూ?"

"ఎందుకూ?"

"ఎందుకంటే.... ఎందుకంటే.... అలా అంటారేమిటి? మనం ఫస్టియర్‌నుండి క్లాస్‌మేట్సుం."

"ఔను....క్లాసులో రోజూ కనబడుతున్నాం."

"చూశారా. ఇన్నాళ్ళనుండి ఒకే క్లాసులో ఉంటున్నా మీ ఇల్లు నాకు తెలియదు, మా ఇల్లు మీకు తెలియదు. ఇదేం స్నేహమండీ?"

అన్ని మాటలనగలిగినందుకు తన వీపుమీద తా౹ చరుచుకోవా లనిపించింది.

రోహిణి మొహం ఎర్రగులాబిలా విచ్చుకుంది.

"ఐతే....మీ ఇంటికెళ్దాంమంటారా?"

"ఔను...."

"సరే....పదండి...."

ప్రవీణ్ కోటీశ్వరుని కొడుకు.

కారెక్కారిద్దరూ. రామబాణంలా దూసుకెళ్ళిన కారు ద్రాక్షతోట లోని గెస్ట్‌హౌస్ ముందాగింది.

తోటలో తిరిగారు కాసేపు. తిరిగేప్పుడు కావాల, ఆవిడ భుజాల మీద చెయ్యేశాడు. రోహిణి నవ్వింది. ఆ నవ్వు కవ్వించింది. టిఫిన్, కాఫీ లొచ్చాయక్కడికే. ఇల్లంతా కలియజూచి -

"మీ గెస్ట్‌హౌస్ చాలా బాగుందం !" అంది. రోహిణి చూపులు ఊలిపొరబట్టల్తో వర్షంలో తడిసిన యువ యువకుల కాలెండర్ మీదునై్న.

"బెడ్రూం ఇంకా బావుందం ! చూద్దాం రండి."

రోహిణి వెనక నడుస్తోంది. ఠ న వెనుదిరిగాడు ప్రవీణ్. నిల దొక్కుకోలేకపోయింది. ఆమె వక్షస్థలం అతని ఛా ని మెత్తగా తాకింది. నవ్వుకున్నారు. నరాల్లో విద్యుత్తు ప్రవహించింది.

బెడ్రూం నిండా అజంతా శిల్పసుందరుల బొమ్మలు వివిధ భంగి మల్లో కనబడుతున్నాయి. రోహిణి కన్నార్పకుండా చూస్తోంది. సిగ్గుల భారంతో తలవంచుకుంది. దగ్గరకెళ్ళి కుడిచేత్తో ఆవిడ గవదను పైకె త్తాడు. రోహిణి ముఖం వెన్నెలలో విరిసిన పారిజాతమైంది. కన్నులు విప్పారి పలుకరిస్తున్నాయి.ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వేడిగా తగులుతున్నాయి. ప్రవీణ్ మనసులో చిలిపికోరికలు చిందులేస్తున్నాయి.

రోహిణి మంచమ్మీద కూచుంది. జారిన పైట సర్దుకోవాలనిపించ లేదు. తాపం పొంగిపోతోందతన్లో. అడుగులో అడుగువేస్తూ మంచం మీదికి చేరాడు. వెన్నెలలు ప్రసరిస్తున్న రోహిణి కనురెప్పలు టపటప లాడినై. నుదుటి చిరుచెమట బిందురూపం దాల్చింది. నాలుగు బిందువు లొకచోట సంగమించి నుదుటి బొట్టును కపోలాలమీదికి జార్చాయి. భుజాల నా క్రమిస్తున్న పురుష హస్తాన్ని వారించలేదు. పెదాల నా క

మిస్తున్న పెదాలను దరించుకోలేదు. నడుము ఒడ్డాణంలా చుట్టేస్తున్న మరో హస్తాన్ని ప్రోత్సహించింది.

భ్రమర టక న్యాయం ప్రవీణ్ వివేకాన్ని నరాల్లోకి లాక్కెళ్ళింది. వాలిన రోహిణి కనురెప్పలు ముద్దులతో నిండిపోతున్నాయి. మెత్తని పరుపుమీద పడిపోయారు. రోహిణిలోని అసలు రోహిణి మేల్కొంది. అణగించని ఆడతనాన్ని అవలీలగా జయించింది మగతనం.

"మిస్టర్ ప్రవీణ్!.... మీ మీ అనుకోనంటే...."

"అబ్బా.... దూరం జరక్కు. సంగతేమిటో ఒక్క ముక్కలో చెప్పెయ్. ప్లీజ్! ఆలస్యం అమృతం విషం గదా?" బలంగా హత్తుకున్నాడు.

"మరేం లేదు. అర్జంట్‌గా నాకో ఐదు వేల రూపాయలు కావాలి.. అత్యవసరం....!"

"ఓస్! అంతే కదా?.... ఓకే!"

o o o

ఎమ్మే పరీక్షలై పోయినై.

కొన్ని నెలలపాటు సరదాగా కంపెనీ ఇచ్చిన రోహిణి పరీక్షలెందుకు రాయలేదు? పరీక్షల ముందు సెలవుల్లో కూడా కన్పించింది. కొంపదీసి పెళ్ళిచేసుకుని వెళ్ళిపోలేదు కదా? ఛా! పెళ్ళయితే నాకు ఆహ్వానం రాదా! ఏమో....: ఇన్ని రోజులా మోహనాంగిని చూడకుండా ఎలా ఉండగలిగా నబ్బా?!.... పరీక్షల మాహాత్మ్యం.

"బావా.... బావా....!" ప్రవీణ్ ఆలోచనలకు బ్రేకు పడేసింది పావని.

"పెళ్ళికి ముహూర్తాలు పెట్టించారు బావా! వచ్చేనెల ఐదో తారీకే మన పెళ్ళట! అబ్బాయిగారి ముక్కుకు ముగుతాడు పడుతోంది సుమా!"

శరత్కాలపు సంపెంగ మొగలాంటి నాసికమీద నక్షత్రంలా మెరిసింది ముక్కుపుడక.

చరచరా బయటికెళ్ళిపోయాడు పవీణ్. పావని ఆశ్చర్య పోయింది.

"ఛీ!.... సరదా తెలీని మనిషి. ఉండు, పెళ్ళికానీ, నీ భరతం పడతా!" గొణుక్కుంది.

వారం రోజుల నుండి పవీణ్‌కు ఒళ్ళంతా కత్తితో పొడిచినట్లుంది. ఆవేశాలెక్కువవు తున్నాయ్. బలహీనత ఆవరిస్తోంది. మనిషి రూపమే మారిపోతోంది.

ఇది విరహ తాపమే, రోహిణి కౌగిట్లో వాలిపోతే అన్నీ సర్దుకుంటాయి అనుకుంటూ కారాహాడు.

రోహిణి ఇంటికెళ్ళడం ఇదే మొదటిసారి. అడ్రసిచ్చింది కాని ఎప్పుడూ ఆహ్వానించలేదింటికి.

"రోహిణి గారున్నారండీ ?" వరండాలో నిల్చున్నావిడ నడిగాడు.

"అరె.... మీరూ.... మీరు పవీణ్‌గారు కదూ?! నన్ను గుర్తుపట్టలేదా?" కోకిల కంఠం.

బ్యూటీఫుల్.... ఈవిడ నెక్కడో చూచాను.

"నేనండీ .... రాధికను. బియస్సీలో మనం క్లాసుమేట్సుం."

ఓహో.... ఔను.... ఒళ్ళు చేసిం !

"మీరు చాలా మారిపోయారు సుమా! వెంటనే గుర్తుపట్టలేకపోయాను. సారీ!...."

"పెళ్ళయిన ఆడదానికి శారీరక మార్పులు సహజమండీ. ఇది మామూలే. పైగానూ.... మీరు రోహిణికోసమొచ్చారా?'

"ఔనండీ . ఏమ్మేలో నా క్లాసుమేటామె."

"హై కుహై, గర్ల్స్ ఫ్రెండు కూడానా?"

ఆ మాటకే దిక్కయినాయి పవీణ్‌కు.

"ఆవిడుందాం ?" అడిగాడు.

"మా ఇంట్లో అద్దెకుం ది. ఇప్పుడు లేదు."

"అంటే?...."

"అబ్బబ్బా.... రోహిణి కోసం రోజుకో బాయ్ ఫ్రెండా?!" అంటూ లోపలనుండి వచ్చాడో యువకుడు.

"వీరు నా భర్త కృష్ణారావు గారు." పరిచయం చేసి తమ పూర్వ పరిచయాలు కూడా చెప్పింది రాధిక తన భర్తతో.

అంతా చూస్తున్న కృష్ణారావు తల్లి—

"ఆ ముదనష్టపుది నంగనాచిలా ఎన్ని రోజులో ఉందిక్కడ. మన కళ్ళలోనేకారం కొట్టింది కిలాడి ముండ...." మెటికలు విరిచింది.

"నువ్వుండమ్మా !" కృష్ణారావు కల్పించుకున్నాడు. "మిస్టర్ ప్రవీణ్! మీరుకూడా రోహిణి బుట్టలోపడ్డారా?"

ఏం చెప్పాలి? అసలింతకూ ఏమైందటా?....బుర్ర గోక్కున్నాడు. కళ్ళు తిరుగుతున్నట్లుంది.

"రోహిణికి తల్లిదండ్రులు లేరట." కృష్ణారావు చెబుతున్నాడు. "అక్కా బావలే చదివించారట. అక్కాబావల కళ్ళుగప్పి తరచుగా బ్లూఫిల్ములు చూసేదట. ఇక్కడ మాత్రం రోజంతా ఎవరితో తిరిగేదో కాని, సాయంత్రం మాత్రం ఇల్లు చేరి బుద్ధిగా ఉం ది. కొద్ది రోజులు ఎడతెరిపిలేని విరోచనాలతో బాధపడింది. బాగా బలహీనమైంది. హైదరాబాదు హాస్పిటల్లో చేర్చాక ఆవిడకు ఎయిడ్స్ సోకిందని నిర్ధారించారట. రోహిణి చనిపోయి పదిరోజులైందట, గది ఖాళీ చేసేందుకొచ్చిన వాళ్ళ బావ చెప్పాడు. రోహిణిని హాస్పిటల్లో చేర్పించింది కూడా ఆయనే."

ప్రవీణ్ నెత్తి మీద పిడుగుల వర్షం కురుస్తోంది.

(అన్వేషణ వారపత్రిక 23 ఆగస్టు 95)

# అంతా మన మంచికే

"అమ్మాయిగారి పుట్టినరోజు గదూ! హార్టీకంగ్రాట్స్."

మహేష్ గ్రీటింగ్స్ ఓరకంటితో స్వీకరించింది మాలతి.

"అబ్బాయిగారు మెట్టినరోజుగదూ! శుభాభినందనలండోయ్!" చేటెడంత కళ్ళను చెవులదాకా తిప్పింది.

"అమ్మాయి పుట్టిందీ, మెట్టిందీ, ఈ అర్భకుణ్ని చేపట్టిందీ ఈరోజు కాబట్టి డబుల్...." మహేష్ మాట పూర్తికాకముందే మాలతి అరచెయ్యి అడ్డుపడి నోటికి తాళం వేసింది.

"నేను పుట్టిన రోజూ, మెట్టినరోజూ ఒకటే కావడం కాకతాళీయం. కాని, మీతో మూడు ముళ్ళు వేయించుకోవడంలోనే ఉంది విశేషమంతా" అంది శూన్యంలోకి చూస్తూ.

"నేన్ని మెడలో మూడు ముళ్ళేసిన తక్షణమే నువు నా ముక్కుకు ముగదా సావుగదా!" అంటూ మాలతిని తనవైపుకు తిప్పుకున్నాడు.

మాలతీ మహేష్‌ల మొదటి పెళ్ళిరోజది.

మాలతి డిగ్రీ పాసైన తెలివితేటలతో రెకమెండేషన్ రెక్కలు నరికి ప్రైవేట్ కంపెనీలో పాపులర్ ఉద్యోగం సంపాదించింది. తల్లి అప్పటి "నాకు ఊరు దూరమౌతుంది, కాడు దగ్గరౌతుంది మాలతీ!...." అంటూ ఎన్నో సార్లు హెచ్చరించింది. అందుక్కారణం ఊఁ అంటే, ఆఁ అనే ఆవిడ అనారోగ్యమే. ముగ్గురు పిల్లలకు జన్మనిచ్చి మాలతి తండ్రి అవతారం చాలించాడు. అప్పట్నుంచి రెక్కలు ముక్కలైనా లెఖ్ఖ చేయకుండా కూతురు చదువు సజావుగా కొనసాగేలా జాగ్రత్త

పడింది. కూతురు ఉద్యోగంలో చేరగా, లక్షలాస్తి చేతికొచ్చినట్టు సంబర పడిపోతూ -

"ఇహ నువ్వో ఇంటిదానివైతే చూడాలనుందే!" అనేసింది.

అబ్బా .... ఈ పెద్దవాళ్ళకి తొందర అనుకుని నవ్వూరుకుంది మాలతి.

చిటపట చినుకులు కుంభవృష్టిగా మారినట్టు పెళ్ళి ప్రస్తావన పోరుగా మారి చెవిలో ఇల్లు కట్టేసుకుంది.

"నేను పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతే చెల్లి, తమ్ముడి గతి కావా లమ్మా?" సీరియస్‌గా అడిగింది మాలతి.

అందుకా పెద్ద ప్రాణం చిన్నగా నవ్వి -

"నిన్ను పెళ్ళి చేసుకొమ్మన్నానే గానీ, వెళ్ళిపొమ్మనలేదు గదా!" అనేసింది. తల్లి అంతరార్థం అర్థమైపోయింది. అంటే .... "పెళ్ళి చేసుకుని ఇల్లు వదలకుండా చల్లగా కాలం గడపాల" నిర్ణయం మాలతి బుగ్గలకు సిగ్గులు పూయించింది. వెంటనే పెళ్ళిళ్ళ పేరయ్య చిట్టాలో పేరు నమోదైంది.

మాలతి ఊఁ అంటే చాలు - పెళ్ళి చేసుకుని చేతిలో చెయ్యేసి చెట్ల నీడల్లో పరుగెత్తాలనుకున్న పెళ్ళికొడుకులు వరుసబట్టారు.

డబ్బూ, దస్కం దండిగా ఉన్న పెళ్ళికొడుకులు "అమ్మాయి నచ్చింది. పైసా కట్నం అక్కరలేదు. ముహూర్తాలు పెట్టించండి" అంటూ మెలికలు తిరిగారు.

కాని, అసలు సంగతి తెలియగానే -

"ఆడపిల్ల ఏనాటికైనా ఆడపిల్లే గదా? పెళ్ళైన ఆడపడుచు అత్తారింటికి చేరడమే ఆచారం గదా? అత్తామామలకు సేవలందించడం పవిత్ర కర్తవ్యం గదా?" అంటూ ముక్కులమీద వేళ్ళేసుకోబోయారు.

ఇల్లరికానికి స. నన్న నిరుద్యోగులు చిరునవ్వులు ఒలకబోస్తూ -

"ఆవిడ జీతమూ, నా జీతమూ మా అమ్మా నాన్నలకే చెందాలి సుమా!" అని, ముందే కుండ బద్దలుకొట్టేశారు.

అరవిరిసిన మల్లెపూవు అరకాలుకిందపడినట్టు - మాలతి మనసు చివుక్కుమంది.

ఇదెక్కడి విచిత్రమో! అస్తమానం తమ పురుషాధిక్యతను చూపుతారే తప్ప 'అయ్యో పాపం!' అనరేమిటీ? పరిస్థితి నర్థం చేసుకోరెందుకో.... వీళ్ళసలు మనుషులేనా.... పెళ్ళికొడుకుల్ని ఉతికి ఆరెయ్యాలనిపించింది మాలతికి.

"మరి మా అమ్మా, తమ్ముడూ, చెల్లీ ఏట్లో దూకాలా?" సూటిగా ప్రశ్నించిందో పెళ్ళికొడుకును, ఎగదోసుకొస్తున్న రోషాన్నాపుకుని.

"ఏమో, అదంతా నాకెందుకూ? త్యాగానికైనా హద్దుంటుంది. కులం చెడినా సుఖం దక్కాలిగదా! కట్నం రాకుంటే మానె, నీ జీతమన్నా తికి రాకపో రెంటికి చెడిన రేవడినై పోనా?" ప్రశ్నకు ప్రశ్నే సమాధానమైంది.

కట్నం, కట్నం, కట్నం.... అస . దురాచారాలకంతేలేదా? ఒక రూపంలో కాకపోతె మరో రూపంలోనా? సంసారమ. బండికి భార్యాభర్తలు రెండు చ కాలు గదా! ఐనప్పుడు భార్యే కట్నం తేవాలనడం అమానుషం.... మాలతి రోషం బ్రహ్మపు తానదిలా గంతులేసింది.

"జన్మనిచ్చిన తల్లి ఋణం ్ర్చుకోవద్దా?" పొంగుకొస్తున్న ఆవేశానికి సంయమనం ఆనకట్ట వేసింది.

"అది మగవాడి బాధ్యత."

"సంతానమంటే మగవాడేనా?" ముక్కుపుటాలెగిసిపడ్డాయి. మూడు రాళ్ళ ముక్కుపుడక మూడు రంగుల్లో మెరిసింది.

"అమ్మో !.... గాలికి పోయే కంపను కాలికి తగిలించుకున్నట్టు.... మాకెందుకూ?" చల్లగా జారుకున్నాడు.

కన్నతల్లి కడుపు కదలి పరంతమైంది. మళ్ళ పెళ్ళి పసక్తి తెస్తే మాలతి అగ్నిపర్వతమైపోతుందేమోన- భయమేసింది.

ఇలా రెండు సంవత్సరాలు గడిచాయి.

ఆరోజు....అలసిపోయిన మాలతి ఆఫీసునుండి వస్తుంది. నడిరోడ్డు మీద దారిలో పడున్న యువకుడిని చూసింది. మాసిన గుడ్డలు, చెదరిన గడ్డం....లోతుకుపోయిన కళ్ళు సగం మూసున్నాయి. చుట్టూ కాకుల్లా చుట్టేశారు జనాలు.

"ఎవడో తప్పతాగినట్టుంది."

"రోడ్డుమీద పడుకుంటానని ఏ వునికి మొక్కుకున్నాడో...."

"రోడ్డుమీద వడకసీను ప్యాషనైపోయింది."

ఎవరిష్టమొచ్చినట్టు వాళ్ళు మాట్లాడ్తూ, తప్పుకుంటున్నారు.

మాలతి జాలిగుండె మైనంలా కరిగింది.

పోయే జనాల నాపి "సాటి మనిషికాస్త సాయం చెయ్యండి — ప్లీజ్!" బతిమాలింది.

వింతగా చూశారంతా.

"ఆయన మీకేమవుతాడూ?" అడిగా డొకాయన.

"నా మీ కాడు, కాని....ఓ నిండు ప్రాణం....అలా...."

"పో....పోవమ్మా! తిని ఊరుకుండక...." మంతలించి ముందుకు సాగాడు ఓ యువకుడు.

"అలాగంటే ఎలా .... ప్లీజ్, మీరన్నా!" మరో యువకుడి కళ్ళ లోకి చూచింది.

"ఆయన చచ్చూరుకుంటే కోర్టుచుట్టూ మనం పదక్షణలు చెయ్యాలి. మన కెందు గొడవా?" ఓర చూపు విసిరాడు.

" పు మనం గూడా ఇలాగే పడిపో॰ మన గ . ఇం కదా?" మాలతి మొహం ఎ రబారింది.

"మన విషయమా! రేపటిదాకా ఎందుకూ? ఇప్ప పార్కు్లో పడిపోదాం పదా!'' భుజమీ ద చెయ్యేశాడు. ళ్లూ జెర్రులు పాకినట్టైంది మాలతికి.

" ....!" చెంప ఛెళ్ళుమంది.

పక్కనున్న కి ళ షాపులోంచి తా. సోడా కొట్టించుకొచ్చి పడున్న యువకుని మొహమ్మీద చల్లింది. మరో సోడా నోటికందించింది. గటగటా తాగేసి మెల్లిగ లేచి కూచున్నాడతడు.

"మీరెటు వెళ్ళాలండీ?" అడిగింది.

జవాబు రా దు.

"చెప్పం .... మీ ఇల్లెక్కడా?'

"...." మ ళ జవాబు రాలేదు. చుట్టూ మూగిన జనాలు ఆసక్తిగా చూస్తున్నారు.

"అబ్బా.... చెప్పండీ, మీ ఆల్లెక్కడా?" మాలతి గొంతులో ఆవేదన, ఆందోళన.

"మా ఇల్లా....!" మాట నూతిలోంచి వచ్చినట్టుంది.

"ఔను...."

బు ర గోక్కుంటూ తల పైకెత్తాడు. మాలతినీ జనాలనూ వరుసగా చూస్తున్నాడు.

గాలికి చెల్లాచెదరైన ఎండుగడ్డిలా జట్టు. పాలిపోయిన మొహం. "ప్చ్...." పెదాలు చప్పరించి నేలమీది కొరిగాడు.

ఆటోరిక్షాలో ఇంటికి తెచ్చింది. అన్నం ప్లేటు ముందుంచగా, అతని కళ్ళు కాంతి పుంజాలైనాయి. మాలతి గుండెల్లోంచి తోసుకొచ్చిన నిట్టూర్పు పెదాలమీద నవ్వుగా మెరిసింది.

మాలతిని చాటుకు సికెళ్ళింది తల్లి.

"ఇదేం చోద్యమే మాలా?" బుగ్గలు నొక్కుకుంది.

"పాపం, రోడ్డుమీద పడుకున్నాడమ్మా !''

"రోడ్డుమీద పడుకున్న వాళ్ళందర్నీ కొంపకు వాలా? వయసులో ఉన్నదానివి. ముక్కూ మొహం తె నివాణ్ణింటికి తెస్తే లోక మేమనుకుంటుందో తెల్సా?"

మాలతి కిమ్మనలేదు.

కుదుటపడ్డాక చెప్పాడతడు:

"నాపేరు మహేష్. చిన్నప్పుడే తల్లిదండ్రులు పోయారు. పల్లెటూర్లో బంధువులింట్లో పెరిగాను. వాళ్ళ ఆస్తి గొడవల్లో నన్ను బయటికి గెంటారు. పొట్ట చేతపట్టుకుని పట్నం చేరాను. అరికాళ్ళు అరిగేట్టు తిరిగినా ఉద్యోగం దొరకలేదు. మూడ్రోజులనుండి తిండిలేదు. వతలా మీరాదుకున్నారు." చేతులు జోడించాడు.

ఏనాటి అనుబంధమో.... ఆత్మీయుడిలా కనిపించిన మహేష్‌కు తన పరిస్థితి అంతా చెప్పేసింది.

మాలతి కళ్ళకు తోడుగా మహేష్ కళ్ళు గూడా చెమ్మగిల్లినై.

"మీరంగీకరిస్తే మీ జీవిత భాగస్వామి నౌతాను. కట్నం అవసరం లేదు. మీవద్ద ఉంటాను. ఇది నా అదృష్టంగా భావిస్తాను" అన్నాడు.

వారం రోజుల్లో అలవి కర్తాంగై పోయింది. వెంటనే కిళ్ళీకొట్టు పెట్టించింది.

"ఏయ్ మాల ! మాల లతా!'' మహేష్ పిలుపు మాలతి నీలోకంలోకి లేదు. ఇంకా శూన్యంలో చూస్తుంది.

"అలా చూసేబదులు కబుర్లేమన్నా చెప్పరాదా?'' చెవిలో గట్టిగా అన్నాడు.

ఉలిక్కిపడింది. ఆ తర్వాత చిలిపిగా నవ్వింది.

''కబుర్లంగానీ....నాదో కోరికం !'' బుంగమూతి పెట్టింది.

"విషయం ఏమిటంటా!"

''ఏమిటంటే ....ఏ....మి....టం....టే...." మనసులోవి మాట పెదాలదాకా వచ్చి ఆగిపోతుంది.

''అబ్బా....మళ్ళ కొత్త పెళ్ళికూతురువై పోతున్నావా?'' అన్నాడు మహేష్.

"మీ ముందు కలకాలం పెళ్ళికూతుర్నే" అందామనిపించింది. కాని కర్తవ్యం గుర్తుకొచ్చి లేచికూచుంది.

''మా చెల్లె తమ్ముళ్ళను చూస్తే మీ మనిపిస్తుందీ?"

మాలతి కొత్తగా మాట్లాడ్తుం మిటీ? వాళ్ళను నే. మన్నానసీ! నా మీద లేనిపోని కొండాలేమన్నా చెప్పారేమో! నిర లాకాశంలో నీలి మేఘంలా నిరుత్సాహం ఆవహించింది.

"చెప్పం .... ప్లీజ్...." కళ్ళలోకి సూటిగా చూచింది.

"వాళ్ళను నా చెల్లె తముడుగా భావిస్తున్నాను మాల !" అంటూంటే అతని మొహం ఎండకు వాడిన ఆకులాగైంది. మాలతి మనసు నెతాగిన గండు తుమె దలాగైంది.

"నాకు మాత్రం వాళ్ళు మన పిల్లలేననిపిస్తుందండీ!" అతని గుండెల మీద ఒదిగిపోయింది.

"నిజమే మాల ః! వాళ్ళను చదివించి పయోజకుల్ని చేసే బాధ్యత మన మీదుంది సుమా!" అన్నాడు మహేష్.

"కాని.... మనకూ పిల్లలు పుడి .... మనల్ని స్వార్థం పురుగులా తొలిచేస్తుంది. అప్పుడు వాళ్ళను పట్టించుకోకపోవచ్చు. తలుచుకుంటే నాకు భయమేస్తుందం !" గుండెమీద చెయ్యేసుకుంది.

"ఐతే.... మ ం చేద్దామంటావు?"

"నేను ట్యూబెక్టమీ ఆప షన్ చేయించుకుంటాను.... ప్లీజ్!"

''అది అప్పటిమాట." దిండుమీది కొరిగాడు.

మాలతిని అనుమానం విషవాయులా చుట్టేసింది.

''ఐతే మీ మాటలు ఆపద మొక్కులు, సంపద ఃర్పులా?" అడిగింది. "మరిప్పు మంటున్నారు?" నిలదీసింది.

''నాకు నా అ వాళ్లు నలుగురున్నారు మాల ః!" అంటూ నవ్వబోయాడు.

''ఛీ.... మీరు మొగుడిలా కాదు, మృగంలా కనబడుతున్నారు." ధుమధుమలాడింది.

మగమహారాజుకు రోషం పొడుచుకొచ్చింది.

''ఏం.... ఎందుకూ?'' దిగ్గున లేచి కూచున్నాడు.

''అప్పుడేమో ఎవరూ లేరన్నారు. ఇప్పుడేమో నలుగురున్నారంటున్నారు. రేపేమంటారో!'' అసహనం కుతకుతలాడింది.

''ఔను. అప్పుడెవ్వరూ లేరు. ఇప్పుడు నా భార్యా, ఆవిడతో మరో ముగ్గురున్నారంటున్నాను. ఆ నలుగురూ నావాళ్లు కాదా?'' లేచి నిలబడ్డాడు.

వి ఖమంగా చూచిందతణ్ణి. కఠోర తపస్సు ఫలితంగా దేవత పత్యక్షమైనట్టనిపించింది. కోపం కొండెక్కి పోయింది!

''మీరెందుకు నా కోరిక చెల్లించరూ?'' గారాబంగా అడిగింది.

''అసలు నీ కోరి మిటీ? మీ చెల్లెలూ తము డూ మనకు దేవు డిచ్చిన పిల్లలు, మనకింకా పిల్లలెందుక గా?''

''ఔనం . సెంట్‌పర్సెంట్ అంతే.'' కళ్ళు జిగేల్‌మన్నై.

''ఐతే, నీ కోరిక . నెప్పుడో చెల్లించేశాను''

"అదెలా?" ఆస క్తిగా అడిగింది.

''పల్లెటూరు నుండి ఈ పట్నం రాగానే ఉద్యోగాల వేట పారం భించాను. ట ఆకలి మంటల్ని రేపింది. బులో చిల్లిగవ్వ లేదు. పభుత్వాసుప తి ముందు కుటుంబ సంక్షేమ వారోత్సవాల బానర్ కన్పించింది. లోపలికెళ్ళాను. ఇద్దరు పిల్లలున్నారని అబద్ధం చెప్పి వేసక్టమీ ఆప షన్ చేయించుకున్నాను. వాళ్ళిచ్చిన పారితోషికం డబ్బుతో వారంరోజులు గడిపాను. తర్వాత కథ మ ళ్ళ మొదటికొచ్చింది. మ్మూడ్రో జుల ఉపవాస దీక్ష తర్వాత నడిరోడ్డుమీద నీ కంటపడ్డాను."

మాలతి మొహం హారతికర్పూర దీపంలా వెలిగిపోయింది. కళ్ళు మిలమిలలాడాయి. మహేష్‌లో మాధవుడు కన్పించాడు.

''అంతా మనమంచికే జరిగిందం ! పాపిష్టిదాన్ని, మిమ్మ ల్ని అనుమానించాను." లెంపలేసుకుంది. మహేష్ అంతరంగం పున్నమినాటి సము దంలా పొంగించి.

(ఆకాశవాణి - హైదరాబాదు, 6- 2-9 )

# పట్నం కోకిల

మాధవరావు మా. జరయాడు.

నిజమే. మామూలు గుమాస్తా మాధవరావు వైకుంఠపాళీ నిచ్చెన ఎక్కేశాడు. అతనికంటే ఐదారుగురు సినియర్స్‌ను అవలీలగా లంఘించి మెరిట్ పెట్టుబడితో ప్రమోషన్ కొట్టేశాడు. మాధవరావుకు ఫైలాలజీలో బోలెడం ప్రావీణ్యత ఉంది. మూడ్రోజుల పనిని మూడుగంటల్లో చేసి చూపించే సత్తా ఉంది. ఆఫీసులో తలెత్తే ఎలాంటి సమస్యనైనా చిటికలో చేయడంలో అతనికత సాటి. ఆఫీసు పనుల్లో ఆల్‌రౌండరంటూ రందరూ. అందు అతడంటే పైవారి నోట్లో పనసపండు.

అందరికంటే చాకచక్యంగా లారీ నడపగల డ్రైవర్‌కు బస్సు నడపడమేమంత కష్టమైన పనికాదుగదా? అలాగే ఆపరేటివ్ పనుల్లో ఆటేరి అకౌంటెన్సీ పరీక్షలో ఫస్ట్‌క్లాస్ మార్కులు సంపాదించిన బెస్ట్‌వర్కర్ అడ్మినిస్ట్రేషన్ పనుల్లో రాణించడం అతిసులభం గదా? అందుకే ప్రమోషన్ వరించింది. ఆ ప్రమోషన్‌లోని ఎమోషన్ హైదరాబాదు దాకా లాక్కొచ్చి మానేజర్ సీట్లో కూచోబెట్టింది.

డ్యూటీలో జాయినైన రోజునుండే అద్దిల్లు కోసం అన్వేషణ ప్రారంభమైంది. చేదోడు వాదోడుగా అటెండర్ గూడా ఉన్నాడు వెంట.

'టులెట్' బోర్డు తగిలించిన ఏ ఇంటికెళ్ళినా 'ఫ్యామిలీకి మాత్రమే ఇవ్వబడును' అనే స్లోగన్ గన్ షాట్‌లా వినబడుతూంది. మాధవరావుకు చిరాకేసింది. కాని చిరాకు గొంతు నులిమి పారెయ్యాల్సి వచ్చింది. లేకపో కొత్త సమస్యలు తలెత్తే అవకాశముంది.

"ముందు నేను దిగిపోతాను. రెండు మూడు నెలల్లో ఫ్యామిలీని తెచ్చుకుంటానం !" సవినయంగా విన్నవించుకున్నాడో ఇంటి ఇల్లాలితో-గడప బయట నిల్చుండి.

"ముందు ఫ్యామి తో దిగండి. ఆ తర్వాత సంగతి ఆలోచిద్దాం!" అంటూ దభీన తలుపులు మూసేసుకుందావిడ. వీపుమీద పిడిగుద్దులు పడినట్టనిపించింది.

ఓ ఫైన్ ఇవినింగ్, అన్వేషణ చివరలో అటెండర్ గుండెల్లో జాలి జాలువారిం మో

"ముందు మీరు అమ్మగారితో దిగిపొండి సార్, ఆ తర్వాత వెంట మళ్ళీ పంపిద్దురుగానీ!...." బహ ండమైన సలహా ఇచ్చాననుకుని భుజాలెగరేశాడు.

"నీ దిక్కుమాలిన సలహా నాకక్కరలేదు గానీ, నోరూ సుకోరా వెధవా!" అనాలనిపించింది కాని, గొంతు దాటిన ఆ మాటలకు పెదాలు దాటే ధైర్యం లేకపోయింది.

"విస్తర్లు ఎత్తమంటే జనాభా లెఖ్ఖలు వెయ్యడం మంచిదికాదు" అనేశాడు.

"అంటే ఏమిటి సార్?"

"అద్దిల్లు వెతుకుదామంటే అమ్మ సంగతి తెస్తావేందుకూ? అమ్మగారి సంగతి ఇప్పుడు కుదరదు." సాధ్యమైనంత నెమ్మదిగా వచ్చింది సమాధానం.

ఐం, అమ్మగారు కాన్పుకెళ్లంటారు. నిండు చూలాలు కాబోలు.... ఎలా వస్తుందీ? అటెండర్ బు రలో మరో ఐడియా తళుక్కుమంది.

"సార్! ప్రస్తుతానికి డ్రామా కంపెనీ అపూ యితో దిగిపొండి. ఆ తర్వాత...."

ఐడియా పూర్తిగాక ముం "నోరు య్!" మన్నాడు. ఆ మర్నాటి నుండి అటెండర్ సహాయ నిరాకరణోద్యమం పారంభించాడు.

తన ఆ- దన నంతా ఆఫీసు స్టాఫు ముందు క క్కాడు.

"ఎవరింటి దగ్గరనైనా ఓ సింగిల్ రూముంటే వెతికి పెట్టండి, ప్లీజ్!...." బతిమాలాడు, బంగారంలాంటి స్టాటస్‌ను పక్కకు నెట్టి.

అదేదో వినరాని మాట విన్నట్టు - ఎవ్వరూ నోరు తెరవలేదు. మాధవరావుకు మూర్ఛరాబోయే సమయంలో హెడ్ క్లార్క్ నోరు విచ్చుకుంది.

"మీరొచ్చి ముచ్చటగా ముప్పై రోజులన్నా కాలేదు. అప్పుడే హైదరాబాదులో అద్దిల్లు.... అదీ సింగిల్ రూం కొరకవచ్చంటే మాటలా సార్?!"

అందరి సమాధాన మదేనన్నట్టు తలలూగాయి. చూపులు నేల మీద వాలాయి.

ప్రమోషన్ సంతోషం చిటికెలో ఫరారైంది. గోరుచుట్టుమీద రోకటి పోటులా ఈ రో వచ్చిందా ఉత్తరం. అది మామూలు ఉత్తరం కాదు. బాంబుకంటే ప్రమాదకరమైంది.

చిత్తగించిన ఉత్తరం ఫైళ్ళ జోలికి పోనివ్వడంలేదు. నరాల్లో సూది మందులా ప్రవేశిస్తున్న నీరసం ఉత్తమ వర్కర్ను ఉత్తమ మనిషిలా మార్చేస్తుంది.

"కాఫీ సాక్!" పొగలు కక్కుతున్న కాఫీ ఫక్కున నవ్వింది.

ఛ....కాఫీ కప్పు గ్గూడా లోకువయానా?! వెధవది .... ఔను .... చెప్పేది విననివాడు చెడిపోతుంటే నవ్వకపోతే ఏం స్తారు? కాని....కాని ....ప్ఫ్....కసి....

ఒక్క గుక్కలో కాఫీ కప్పు ఖా అయిపోయింది.

నరాలు మళ్ళీ నార్మల్ కొస్తున్నాయి. అ ఉత్తరం మళ్ళీ మాధవ రావు చేతుల్లో విప్పుకుంది.

"అల్లుడు మాధవరావుకు—

నీ నిరాదరణకు గురైన నా కూతురు లవంగిని ఊరివాళ్ళంతా ఆడిపోసుకుంటున్నారు. మీరు విడిగా ఉండి ఇప్పటికి నాలుగేళ్ళు దాటింది. మర్యాదగా వచ్చి లవంగిని సుకెళ్తావో లేక విడాకుల నోటీసు పంపించ మంటావో వెంటనే జవాబు రాసి పడెయ్!''

పదుగురిలో అట్టహాసంగా తన కాళ్ళు కడిగి కన్యాదానం చేసిన మామగారి వార్నింగది!

లవంగి నా నిరాదరణకు గురైందా? నో-ఇదన్యాయం. అయ్యో భగవాన్!....నిజానికి నా నిరాదరణకు గురైంది మరదలు రాజి....అ రాజవ్వ. ఔను....రాజి ఇప్పుడెలాగుందో?....

ఆ రోజు....మేనమామకు అనారోగ్యం ముంచుకొచ్చిందనే కబు రొచ్చింది. అమ్మా, నాన్నల వెంట తానుగూడా వెళ్ళాడు- పల్లెటూరుకు.

మేనమామ మంచమీ ద మెలికలు తిరిగిపోతున్నాడు. నిప్పుల్లో పడిపోయినట్టు రొప్పుతున్నాడు. పాణాలు కళ్ళల్లో కొచ్చినట్టున్నాయి. తననూ, అమా , నాన్నలను దగ్గరకు రమ్మన్నాడు కళ్ళతో. అప్పు కాస్త నెమ్మదించినట్టుంది.

"మన మాధవుడికి లక్షల్లో కట్నమొస్తుంది. దాంతో మనం సుఖంగా బతకొచ్చు.'' అంతకు ముందోసారి నాన్న అమ్మతో వాదించిన విషయం గుర్తుకొచ్చింది.'' జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలినట్టు మీ అన్నయ్య కూతురు రాజి మనింటి కోడలైతే ప్రయోజనమేముందీ? వాడు మో పట్నంలో నాగరిక ప్రపంచంలో తిరిగే వాడాయె. ఈ పల్లెటూరి పిల్ల వాడి మెడకో గుదిబండై కూచుంటుంది.''

''రాజి నాకొద్దు!" తన గొంతు చించుకు వచ్చిన అరుపుకు నాన్న మొహం విప్పారింది. తనను కొరుక్కుతింటానన్నట్టు చూస్తూ అమ అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. అత్త లబోదిబోమంది. రాజి మొహం ఆ సిన మసిగుడ్డలాగైంది. ఆమె కళ్ళేవో చెప్పాలనుకుంటున్నాయి కాని పెదాలు విప్పుకోవడంలేదు.

''రాజికి చదవడం, రాయడం వస్తుందన్నయ్యా! అది పరీక్ష లియ్యలేదుగానీ రామాయణం, భారతం బాగా చదువుతూంది. ఇంగ్లీషు ముక్కలు గూడా నేర్చుకుంది.'' అత్త చివరి ప్రయత్నం.

"చాలు చాల్లేవమ్మా! చేసుకునేది వాడు. వాడికిష్టం లేనిది . . ం జెయ్యాలి?'' నాన్న గూడా తప్పుకున్నాడు.

క్షమించరాని ..రం చేసి గ్రామ బహిష్కరణకు గురైన నేరస్తుల్లా త్త కూతుళ్ళు ఉన్న పళాన బయల్దేరి వెళ్ళిపోయారు.

ఆ తర్వాత రెం ళ్ళకు కోటీశ్వరుని కూతురు లవంగి లక్షన్నర కట్నంతో తన జీవితంలో ప్రవేశించింది. పెద్దింట్లో పెరిగిందని లవంగికి అమ్మ అతి మర్యాదలు చేసింది.

వంటపనీ, ఇంటిపనీ అన్నీ అమ్మ వంతే. లవంగి మో తొమ్మిది న్నరగ్గాని తెల్లారదు. అప్పుడైనా గొంగ , చెప్పులూ రెండూ నావి

కావన్నట్టు - పనుల్లో జోక్యం చేసుకు ది కాదు. ఆవిడ దృష్టిలో అమ్మో సేవకురాలై పోయింది. ఆ పనులూ ఈ పనులూ పురమాయిస్తూ సేవలు చేయించుకోవడం లవంగి కలవాటైంది.

లవంగి రోజంతా నవలల్తో కుస్తీపడుతుండేది. సినిమాలకూ, షికార్లకూ ఖెఖ్కేలేదు.

"అమ కు పనుల్లో కాస్త సాయం చెయ్యి లవంగీ!" అన్నాడు తనోసారి.

అరచేతులంత కళ్ళను అటూ ఇటూ తిప్పేసి.... "ఇంటి పనులు స్వయంగా చేసుకోవడం మా ఇంటావంటా లేదు. ఇప్పుడు కొత్త అలవాటు రాదుగదా!" అ సింది అందాలను అద్దంలో చూచుకుంటూ.

"....కాని, నువ్వుం ది ఈ ఇంట్లో. సహజీవనం సాగించేది నాతో. ఇంటిపనులే బరువై పో ఎలా?"

"ఆ పనులన్నీ మీకలవాటేగదా! అంతగా కావాలంటే ఓ నౌకర్ను పెట్టుకుందాం." అందమైన భుజాలు అలవోకగా ఎగిరిపడ్డాయి.

మూడు నెలలు గడిచాయెలాగో. లవంగి తల్లి కాబోతుందన్న సంగతి తెలిసింది. కోట్ల రూపాయల అస్తి దక్కబోతున్నంత సంబరపడి పోయారు అమ్మానాన్నలు. తియ్యని అనుభూతులు తనను ఊహాలోకానికి లాక్కెళ్ళాయి. అప్పుడే లవంగి పుట్టింటికెళ్ళి వచ్చింది.

పుట్టింటినుండి వచ్చిన లవంగి ముద్దమందారం లాగుంది. ఎన్నడూ లేనంత సంబరపడిపోతుంది.

"నీ సంతోష సాగరంలో నన్నుగూడా తేలిపోనీ.... ఇంతకూ ఈ సంతోషానికి కారణం?" అడుగాడు తను.

''నేను ఎంచక్కా అబార్షన్ చేయించుకున్నా! చావుకబురు చావ కింది నీరులా వచ్చేసింది. విషయం తెలిసిన అమ్మ అగ్ని పర్వతాలు పత్యక్షంగా చూస్తున్నట్టు అవాక్కైపోయింది.

"అయ్యో....ఇ మి అపచారం తల్లీ?...."అమ్మ కళ్ళు తడయ్యాయి.

''మాతో ఒక్క మాటన్నా చెప్పకుండా ఇంత సాహసమా?'' నాన్న పడక్కుర్చీలో కూలబడిపోయాడు.

తన గుండెల్లో సముద్రపు హోరు....తన ఆశాసౌధాల నెవరో నిర్దాక్షిణ్యంగా కూలగొడుతున్నట్టనిపించింది. లవంగి పీక నులిమెయ్యా లన్నంత ఆ-శం పొంగుకొచ్చింది.

''ఎందుకంత పాపానికొడిగట్టావ్? నువ్వింకా బాలాకుమారివను కుంటున్నావా? పాతికేళ్ళ వయసు రాగా సరా?" గద్దించాడు.

"నా కడుపు, నా ఇష్టం. పిల్లలు పుడితే నా అందమంతా గంగ పాలై పోతుంది-తెల్సా?...." చిరుబుర్రులాడింది.

పేలబోయే బాంబులాగైంది తన పరిస్థితి.

"అంటే....నువ్వసలు పిల్లల్నే కనవా?"

"ఏమో....ఆలోచిస్తా!"

"మాతృత్వం ఆడదానికో వరమమ్మా! మా వంశాన్నుద్ధరిస్తావను కున్నాం." కుప్పకూలిన అమ్మ కళ్ళు శావణమేఘాలైనాయి.

"ఆఁ.... మాతృత్వమా, వంకాయనా? అందచందాల గురించి పాతచింతకాయ పచ్చడి ం దెల్సా?" ఒంటికాలు మీద లేచింది లవంగి.

"ఈ ఇంట్లో అందరూ సన్న, నంగనాచులే. ఒక్కరి నాగరికత తె దు. అంతా పదో శతాబ్దం మనుషులే. ఛీ....వెధవ కొంప!" లవంగి

మొహం రక్తవర్ణమైంది. వక్షస్థలం ఎగిసిపడుతూంటే గదిలో దూరి పోయింది.

తన కోపం నశాళానికంటింది,

"నువ్వసలు మనిషివేనా?" లవంగి చెంప ఛెళ్లుమంది. తనను తాను నిగ్రహించుకోవడం అసాధ్యమైపోయింది.

లవంగి రోషం పదింతలైంది. అభిజాత్యం ఆగనంది.

"నన్ను కొడతావా రాస్కెల్?" పళ్ళు పటపట లాడినై. దెబ్బకు దెబ్బ సమాధానమైంది. అరగంటలో సూటుకేసు సర్దుకుని వెళ్ళిపోయింది,

"సార్....సార్!"

నీరవనిధిలో ఒంటరిగా సంచరిస్తున్న మనసు హెడ్‌క్లార్క్ పిలుపుతో వర్తమానంలో కొచ్చింది.

"వీరు నిన్నటివరకు వులో ఉన్న స్టెనోగ్రాఫర్ రాధగారండి!" పక్కనున్న యువతిని పరిచయంచేసి తప్పుకున్నాడు.

నిండుగా పండిన రేగుపండు హఛాయ. రేకులు విప్పిన వదన కమలము. సన్నని పొడగాటి ముక్కూ, నల్లని కలువకళ్ళూ. చెక్కు టద్దాల్ని తలదన్నె చెక్కిళ్ళూ, పొంగుకొచ్చిన వయసు ఆనవాళ్ళను భద్రంగా దాస్తున్న కొంగు....రాధంటే ఈవిడే నా!

"నమస్కారం సార్! వునుండి ఈరోజే వచ్చాను సార్?"

"నువ్వు....నువ్వు...." ఏదో అనాలనుకుంది. గుండె గుబగుబ లాడింది.

"ఏమిటి సార్?"

మందారమకరందాలకెళ్ళిన తుమ్మెద అక్కడే మూర్ఛపోయిన మాధవరావు చూపులు రాధ నెక్కడెక్కడో తడుముతున్నాయి.

''సార్... సార్....జాయినింగ్ రిపోర్ట్ సార్!''.

''వెరీగుడ్, వచ్చేశారు గదా!'' సర్దుకోక తప్పలేదు. "నా పేరు మాధవరావు. కొత్తగా ప్రమోషన్ మీదొచ్చాను.'' కళ్ళలోని ఆశ్చర్యం పెదాలమీది నవ్వుగా అవతారం దాల్చింది.

''చాలా సంతోషం సార్!'' శృతి చేసిన వీణానాదం.

ఈమె నెక్కడైనా చూచానా?

లంచ్ తర్వాత....

మానస సరోవరంలో రాయంచలా అడుగులేస్తూ వచ్చింది రాధ చాంబర్లోకి.

''డిక్టేషనేమన్నా ఉందా సార్?'' అరచేతులంత కళ్ళు అటూ ఇటూ తిరిగాయి.

''డిక్టేషనేమ్‌లేదు గానీ, మీ పేరూ....'' అనుమానం వెనకాముందా డింది.

''సాయంతం మా ఇంటికి రండి సార్!'' కాయితం ముక్క మీద చకచకా అడ్రసు రాసి టేబుల్ మీదుంచి వెళ్ళిపోయింది.

సాయంత్రం ఆరైంది. శత్రు సైన్యం దురాక్రమణ చెయ్యక ముందే రక్షణ దళాలు ఎదురు దాడికి తయారైనట్టు - కటిక చీకటి భూమాతను కప్పక ముందే వీధి దీపాలు మేమున్నామన్నాయి.

"ఎవరండీ మీరు?" లోపలికి వెళ్ళబోతున్న మాధవరావు మీదికి ప్రశ్నాబాణం వదిలాడో యువకుడు. అతడు ఎత్తుగా, బలిష్టంగా, తెల్లగా ఉన్నాడు.

రాధ ఇచ్చిన అడ్రసు ఇల్లేకదా ఇది! కాయితంతో ఇంటి నెంబరు పోల్చి చూచుకున్నాడు ఇదే ఇల్లు....

పల్లెటూరు కాకి అనుకున్న రాజి పట్నం కోకిలై పోయిందన్న మాట!

''నువ్వు చాలా మారిపోయావు రా !"

"ఏమో బావా! మొన్న మీ ఊరు వెళ్ళాను. అత్తయ్య లవంగి గురిం , నీ గురించీ అంతా చెప్పింది. నాకెంతో బాధనిపిస్తుంది...."

రాధ సానుభూతి మాటలు సూదుల్లా గుచ్చుకుంటున్నాయి. పని మనిషి టీ అందిస్తుంది.

''కట్నాన్ని కమ డుబో కష్టాలు కొనితెచ్చున్నట్టే గదా?'' టీ ఎప్ చేస్తున్న చ ధారి కనుబొమలు పైకి లెచాయి.

మాధవరావు బు ర భూగోళమైంది. గుండెకు ఏ మూలనో గాయమై అందులోంచి ఒక్కొక్క కన్నీటిచుక్క వసస్తున్నట్టని పించింది.

"చేసుకున్నోడికి చేసుకున్నంత!" మాధవరావు పెదాలు దాటిన మాట రాధ, చక్రధారులదాకా పాకలేదు.

"దూరపుకొండలు ఎప్పుడూ నునుపేనం !"

ఈ మాటలు అందరి వినబడినై.

"నమచ్కారమం !" చేతులు జోడించిందో చిన్నారి - ఎంతో ముద్దొస్తుంది.

''ఇది మా అమ్మాయి రత్న." చ కధారి ఒళ్ళోకి లాక్కున్నాడా పాపను.

(ఆకాశవాణి- హైదరాబాదు వాణిజ్య, 3 -8- 99 )



"చిలకపచ్చ చీర" సృష్టికర్త ఐతా చంద్రయ్య గారి

అభినందనలు

మీ సేవయే - మా ఆనందము

**సాయినాథ్ చారిటబుల్ ట్రస్ట్**

1 - - 58 భారత్‌నగర్, సిద్ధిపేట-502 103

ఫోన్ : 24131

ట్రస్టీలు :

తోట లక్ష్మయ్య, నేతి లచ్చయ్య, దమ్మ సత్యనారాయణ

మరియు బాలనర్సయ్య.

---

"చిలకపచ్చ చీర" కథా సంకలనము వెలువడుతున్న

శుభ సందర్భముగా మా శుభాభినందనలు

యువత సంక్షేమమే మా లక్ష్యం

**కళ్యాణి చారిటబుల్ ట్రస్ట్**

బాలాజి టాకీసు ఎదురుగా, సిద్ధిపేట-502 103

ఫోన్ : 23864

ధర్మకర్తలు :

గుండ్ల జనార్దన్, మంచికట్ల వెంకటేశం, గాలి రమేష్,

తిప్పరాజు గోపాల్.

కథా పియులకు కమ్మని కానుక "చిలకపచ్చ చీర"

వెలువడుతున్న సందర్భముగా

మా హృదయపూర్వకాభినందనలు.

వైశ్య యువత ఆనందమే మా ఆశయం

## వాసవి చారిటబుల్ టస్ట్

(రి. 3 /95) మేన్‌రోడ్, సిద్ధిపేట-502103

ఫోన్ : 2 7 5

ధర్మకర్తలు :

పోకల రా శం, అమరిశెట్టి బాలరాజు, బచ్చు రమేష్,

కొంతూరి అంజయ్య, గండె కా నాథం,

కొంతూరి లక్ష్మయ్య.

